# తొలిమాట

కీర్తిశేషులైన శ్రీ డి.బాలగంగాధర తిలక్ గారి అముద్రిత కథ ఒకదాన్ని ఈ సంచికలో ప్రచురించగలిగినందుకు సంతోషిస్తున్నాము. (25 వ పేజీ)

* * *

ఈ సంచిక నుంచి ప్రముఖ రచయిత్రి శ్రీమతి విజయలక్ష్మి రామకృష్ణన్ గారి "కిశోర ప్రాయం" నవలను సీరియలైజ్ చేస్తున్నాము (41వ పేజీ). వచ్చే సంచికలో మరొక సీరియల్ ప్రారంభం కానున్నది.

మార్చి నెల "జ్యోతి"లో మా వల్ల జరిగిన ఒక పొరపాటును—ఒక విద్యార్థి రచయితచేసిన అనుచిత చర్యను—పలువురు పాఠకులు మా దృష్టికి తెచ్చారు. "చిన్నకథల పోటీ"లో రెండవ బహుమతి పొందిన శ్రీ పి. బి. రామారావు "నీకు జ్ఞాపకం వుందా?" అనే కథ డిసెంబరు 66 "రీడర్స్ డైజెస్ట్" లో ఎర్ల్ రీడ్ సిల్వర్స్ వ్రాసిన "డు యు రిమెంబర్" కథకు శీర్షికతో సహా కాపీ. విద్యార్థులలో మౌలికరచనాశక్తిని ప్రోత్సహించడానికేర్పాటైన "చిన్నకథలపోటీ"ని ఈవిధంగా దుర్వినియోగం చేయడం ఏమి న్యాయం రామారావు గారూ? లేక, ఏ విధంగా వచ్చినా, పేరొస్తే చాలు ననుకున్నారా? "చిన్నకథలపోటీ"లో ఒక ముఖ్య నిబంధన రచనలు స్వతంత్రమైనవిగా వుండడం. ఈ నిబంధన పాటింపులో రచయితలు కూడా మాతో సహకరించడం అత్యవసరం.

వేమిరి రాధాకృష్ణ




ఒక్క రెండు నెలల్లో ఇండియా రాజకీయ స్వరూపం మారిపోయింది

భారత ప్రజాస్వామ్యం ఒక్కసారిగా ఎదిగినట్లు కనిపిస్తోంది ఇరవయ్యేళ్ళకి, ఇరవై ఒకటికి, దానికి యుక్తవయస్సు వచ్చినట్టుంది ఇప్పుడది వయస్సుకు తగిన పోకడలు పోతోంది

ఇదంతా జనరల్ ఎన్నికల ఫలితం స్వాతంత్ర్యానికి ముందు తరవాత ఏకైక రాజకీయ సంస్థగా చెలామణి అయిన కాంగ్రెసు ఇప్పుడు ఒక డజను పార్టీలలో ఒకటిగా మిగిలింది ఏకస్వామ్య ఆధిపత్యం చేయడానికి ఒక మెట్టు మాత్రమే క్రిందది ఇప్పుడు తన ఏకచ్ఛత్రాధిపత్యం పోవడంతో కాంగ్రెసుపార్టీ స్వరూప, స్వభావాలుకూడా మారిపోతాయని, మన ప్రజాస్వామ్యాన్ని మరింత పరిపుష్టం చేస్తాయని ఆశించవచ్చు.

కాంగ్రెసు చాలా రాష్ట్రాలలో అధికారం కోల్పోయింది ప్రస్తుతానికి అది కొంత సుస్థిరమైన ప్రభుత్వాలు స్థాపించిన రాష్ట్రాలు మైసూరు, ఆంధ్ర, మధ్యప్రదేశ్, అస్సాం, గుజరాత్, మహారాష్ట్ర మాత్రమే యు పి లో కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడినప్పటికి అది ఎన్నాళ్ళు కొనసాగుతుందో చెప్పలేము రాజస్థాన్‌లో కొందరు ఇండిపెండెంట్లను కలుపుకుని అది ప్రభుత్వం ఏర్పరచబోయిందిగాని, ప్రతిపక్షాల తీవ్ర ప్రతిఘటనవల్ల అది సాగరాలేదు ప్రస్తుతం అది రాష్ట్రపతి పాలన క్రిందకి పోయింది. హరియానాలో కాంగ్రెసు పూర్తి మెజారిటీ సంపాదించి ప్రభుత్వం ఏర్పరచిందిగాని, దానినుంచి పదముగ్గురు సభ్యులు రాజీనామా చేయడంతో అది మైనారిటీ పార్టీగా మారిపోయింది. తిరుగుబాటుచేసిన కాంగ్రెసువాదుల నాయకత్వాన ఇప్పుడక్కడ మిశ్రమ ప్రభుత్వంలాంటిది ఏర్పడింది

అంతే, కాంగ్రెసు ప్రతిపక్షంగా కూర్చోవలసివచ్చిన రాష్ట్రాలు ఎడు మద్రాసులో డి. ఎం. కె. ప్రభుత్వం ఏర్పడింది. కేరళలో మార్క్సిస్టు కమ్యూనిస్టుల నాయకత్వాన వామపక్షాల మిశ్రమ ప్రభుత్వం వచ్చింది బెంగాల్, బీహార్, పంజాబు, ఒరిస్సాలలో వివిధ పక్షాలు కలసి మిశ్రమ ప్రభుత్వాలేరపరచారు.

వివిధ రాష్ట్రాలలో మిశ్రమ ప్రభుత్వాలను ఏర్పాటు చేసిన రాజ

కీయ పక్షాలలో చాలా వాటికి సిద్ధాంత విభేదాలున్నాయి. వాటిలో జనసంఘం, స్వతంత్రపార్టీవంటి మిత వాద పక్షాలు, కమ్యూనిస్టు పార్టీలు, సంయుక్త సోషలిస్టుపార్టీ వంటి అతి వాదపక్షాలువున్నాయి కాంగ్రెసుతో పెద్దగా విభేదాలు లేని బంగ్లా కాంగ్రెసువంటి పార్టీలున్నాయి వీటిని ఒకే ప్రభుత్వపుగొడుగుక్రిందికి రప్పించినదల్లా వాటి కాంగ్రెసు వ్యతిరేకత మాత్రమే. కాంగ్రెసును ఏ విధంగానైనా అధికారంనుంచి తొలగించాలన్నదే వాటి ఏకైక ఆశయం. అందువల్లనే అవి కనీసపు కార్యక్రమాలంటూ ఒక ఒడంబడిక కకువచ్చి ప్రభుత్వా లేర్పరచాయి. కాంగ్రెసు ఇంతకాలంగా చెబుతూ వచ్చి, చేయకుండా పోయిన పను లెన్నో తాము చేయగలమని వాగ్దానాలు చేస్తున్నాయి అవి తమ వాగ్దానాలను నెరవేర్చు కొనడానికి ముఖ్యంగా కావలసింది తమలో తాము కీచులాడుకుని విడిపోకుండా వుండడం. వచ్చే అయిదేళ్ళ వరకు ఈ వివిధ విరుద్ధ పక్షాలు కలిసి వుండగలవా, కాంగ్రెసుకంటె సుపరిపాలనను ప్రజల కివ్వగలవా అనేది చూడవలసి వుంది.

ప్రస్తుత పరిస్థితులలో కేంద్రంలో కాంగ్రెసు అధికారంలోకి రావడం మంచిదిగానే భావించాలి. ఎంత చెడ్డా అంగబలం, అర్థబలం, పరిపాలనానుభవం, ఒక విధమైన కుదురుబాటు కలిగిన పార్టీ అదొక్కటే. కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెసు, మరికొన్నిటిలో కాంగ్రెసేతర పక్షాలు అధికారంలో వున్న సమయంలో వాటికి వీటికి మధ్య సమన్వయం కుదిర్చి, దేశానికి సుస్థిరత్వాన్ని చేకూర్చడానికిగాను కేంద్రంలో కాంగ్రెసు రావడం మంచిదే.

అయితే, ఒక విషయం లోక్‌సభలో కాంగ్రెసుకు పూర్వంవలె 'బ్రూట్ మెజారిటీ' లేదు. దాని బలం చాలా తగ్గిపోయింది. సంఖ్యాబలం తగ్గడం అలావుంచి, నాయకత్వ బలం కూడా దానికిలేదు. లేదు. స్వాతంత్ర్య సమరంనాటి అగ్రనాయకులు ఇప్పుడెవ్వరు మిగిలి లేరు ఉన్నవారందరు రెండవ స్థాయికి, మూడవస్థాయికి చెందిన ఒకమాదిరి నాయకులు. అందుచేత, కాంగ్రెసు బాగా బలహీనమై పోయింది

ఇక అటు ప్రతిపక్షాలనుచూస్తే వాటి సంఖ్యాబలం పూర్వంకంటె రెట్టింపు కావడమే కాదు, నాయకత్వంకూడా బలంగావుంది యువకులు, ఉన్నతాదర్శ ప్రేరితులుఅయిన కొత్త నాయకులు ప్రతిపక్షాలలో హెచ్చుగా వున్నారు.

అందువల్ల కేంద్రంలో కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడినప్పటికి, ఇదివరకటి 'రోడ్ రోలర్ టాక్టిక్స్' ఇప్పుడు పనిచేయవు. ప్రతిపక్షాలు తలచుకుంటే ప్రభుత్వాన్ని రోజు

కొకసారి ఒక ఊపు ఊపి వదల గలవు. కడచిన మూడేళ్ళుగా తమ సంఖ్యాబలం తక్కువైనా ప్రతి పక్షాలు కాంగ్రెసు ప్రభుత్వాన్ని పార్లమెంటు లోపల, బయటకూడా ఎన్నెన్ని తిప్పలుపెట్టాయో చూస్తే, ఇకపై కాంగ్రెసు పని పూలబాటపై నడకవలె వుండబోదని నిర్ధారణంగా చెప్పవచ్చు.

అందుకే కాంగ్రెసు ఒకపని చేసి వుంటే బావుండేదనిపిస్తుంది కేంద్రంలో తనబలంతగ్గింది, రాష్ట్రాలలో తగ్గింది. అయినప్పుడు, కొన్ని ప్రతిపక్షాలను కూడా కలుపుకుని జాతీయ ప్రభుత్వమనే పేరుతో మిశ్రమ ప్రభుత్వం ఏర్పరిస్తే సముచితంగా వుండేది కాదా? నాయకత్వాన్ని తనచేతిలోనే వుంచుకున్నా, ప్రతిపక్షాల నుంచి ప్రతిభ, శీలసంపద సామర్థ్యం కలిగిన వారిని తీసుకునివుంటే బావుండేది కాదా?

అలాచేస్తే కాంగ్రెసు ప్రతిష్ఠ మరింత పెరిగివుండేది. దేశాన్ని ప్రస్తుతం ఎదుర్కొంటున్న అనేక ఈతిబాధలను సమైక్యంగా, సమర్థంగా ఎదుర్కొనడం సాధ్యమయ్యేది ప్రతిపక్షాల సహకారం, అవి అధికారంలోవున్న రాష్ట్రాల సహకారం కేంద్రానికి లభించేది. అంతర్విభేదాలతో, ఆర్థిక సంక్షోభంతో బలహీన పడుతున్నట్టు కనిపిస్తున్న దేశానికి అంతర్జాతీయంగా కూడా ప్రతిష్ఠ పెరిగేది.

## అత్యవసర సమస్యలు

కేంద్రంలోనేమి, రాష్ట్రాలలోనేమి ప్రభుత్వాలు అత్యవసరంగా ఎదుర్కొని పరిష్కరించ వలసిన సమస్యలు కొన్ని వున్నాయి అన్నిటికంటె ముఖ్యమైనది ఆహారసమస్య. రెండేళ్ళనుంచి మన ఆహారోత్పత్తి పడిపోయింది అంతకు పూర్వమైనా దేశం స్వయం పోషకంగా లేని మాట నిజమే. ఏటేటా కోట్లకొలది రూపాయల ధనం వెచ్చించి ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకోనిదే మనకు గడవడం లేదు కాని రెండేళ్ళు వరసగా అనావృష్టి సంభవించడంతో ఆహారోత్పత్తి బాగా పడిపోయి, ఇతరదేశాలపై ఆధారపడడంఎక్కువైపోయింది. అంతమాత్రాన కాంగ్రెసుప్రభుత్వాల బాధ్యత బొత్తిగా లేదనికాదు. ఇటువంటి అహాంతర పరిస్థితులను తట్టుకొనడానికివీలుగా పుష్కలంగా వ్యవసాయ పథకాలను అమలు చేయలేక పోయిన దోషం ప్రభుత్వాలదే. త్వరగా ఫలితానికిరాని పెద్ద ఇరిగేషన్ ప్రాజెక్టులను తలపెట్టి, వాటిని నానబెడుతూ, చిన్ననీటి వనరులను అశ్రద్ధ చెయడం జరిగింది. మన దేశంలో అత్యధిక సంఖ్యాకులు వ్యవసాయంపై ఆధారపడినవారైనప్పటికి వారిని, వారి వ్యవసాయాన్ని అశ్రద్ధచేసి ఇతర అభివృద్ధి పథకాలకు మన ప్రణాళికలలో ప్రాధాన్యమివ్వడం జరిగింది.

ఇప్పుడు ఈ లోపాన్ని సరిదిద్దుకోవాలి

ఆహారంలో స్వయం సమృద్ధి తరవాత పరిష్కరించ వలసినవి ధరల పెరుగుదల, నిరుద్యోగం, జనాభా పెరుగుదల, అవినీతి మొదలైన సమస్యలెన్నో వున్నాయి ఇవి అన్నీ ఒక్కనాటితో పరిష్కారం కాని మాట నిజమే కాలేవని ఎవ్వరు ఆశించలేని మాటనిజమే కాని వాటిని పరిష్కరించడానికి ప్రభుత్వాలుచిత్త శుద్ధితో యత్నిస్తున్నాయనే విశ్వాసమైనా ప్రజలకు కలగాలి కల్లబొల్లి కబుర్లతో కాలక్షేపం చేయడం ఇకపై కుదరదు ప్రజలలో రాజకీయ చైతన్యం కలిగింది ఏదిమంచి, ఏదికాదు అనేది వారికి అవగాహన అవుతున్నదిఅవుతున్నట్టుఇటీవలిఎన్నికలలోరుజువైంది అందువల్ల ప్రజలకు సంతృప్తికరమైన విధంగా ప్రభుత్వాలు నిజాయితీతో కూడినకృషిని వెనువెంటనే ప్రారంభించవలసి వుంది వ్యవధిలేదు అనతికాలంలో ప్రజలకు అందుబాటులోకి రాగల సత్ఫలితాలను యథార్థంగా సాధించాలి లేకపోతే మనప్రజాస్వామ్యానికి సయితం ముప్పు కలిగించే ఏ ఘోర సంఘటనలు జరుగగలవో ఎవరూ ఊహించలేరు. నివురుకప్పిన నిప్పు ఎప్పుడూ నివురు కప్పుకునే వుంటుందని భావించడంకంటె తెలివి తక్కువ మరొకటి లేదు

## రాష్ట్రంలో

అదృష్టవశాత్తు కాంగ్రెసు గెలిచిన రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. ప్రతిపక్షాల అనైక్యంవల్ల, ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీల చీలికవల్ల కాంగ్రెసు ఈసారి గెలిచింది లేకపోతే మద్రాసులో చిత్తుగా ఓడిపోయిన కాంగ్రెసు ఇక్కడ విజయం పొందవలసిన పరిస్థితి లేదు. ఇతర రాష్ట్రాలలో కంటె ఇక్కడ కాంగ్రెసుపై, దాని ప్రభుత్వంపై, దాని నాయకులపై తక్కువ అసంతృప్తి లేదు. ఎన్నికలకుముందు కాంగ్రెసుపై ఇక్కడ వెల్లడిఅయిన జుగుప్స తక్కువది కాదు.

అయినా, ఏదో గాలివాటుగా కాంగ్రెసు గట్టెక్కింది. ఇది తమ బలమని, ప్రతిభ అని కాంగ్రెసు నాయకులు భావిస్తున్నట్టున్నారు. ఇతర రాష్ట్రాలలో కాంగ్రెసు తిన్న దెబ్బలను చూసి కూడా ఇక్కడి నాయకులు ఏమీ గుణపాఠం నేర్చుకున్నట్టు లేదు. యథాప్రకారంగా తమ కుట్రలు, కీచులాటలు ప్రారంభించారు.

పార్టీ నాయకత్వానికి పోటీ చేయడానికి మొదట శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి నిశ్చయించారు. ఆ తరవాత ఎవరైనా సలహా ఇచ్చారో, లేక పోటీలో తాము ఎలాగూ నెగ్గలేమని గ్రహించారో, లేక కాంగ్రెసు సమైక్యాన్ని నిజంగానే కాపాడ

వెలచారో, ఏమైతేనేం, పోటీనుంచి విరమించారు.

శ్రీ బ్రహ్మానందరెడ్డి ఏకగ్రీవంగా పార్టీ నాయకుడుగా ఎన్నికైనారు ఆయన ముఖ్యమంత్రిగా మంత్రి వర్గాన్ని ఏర్పరచారు తన మంత్రులను ఎంచుకునే హక్కు ఆయనకు పూర్తిగా వుంది అయినా, ఆయన సయోధ్య వర్గంవారిని ఒక్కరినైనా మంత్రి వర్గంలోకి తీసుకోకపోవడం, శ్రీ సుబ్బారెడ్డి, శ్రీ రామచంద్రారెడ్డి మొదలైనవారిని వదలివేయడం ఆశ్చర్యంగానే వుంది. వారికంటె సమర్థులను తీసుకున్నారని భావించడానికి కూడా ఆస్కారం లేదు కేవలం తన గ్రూపులో ముఖ్యులైనవారికి తను నమ్మిన వారికి, తనను నమ్మిన వారికి, ఎన్నికలలో తనకు అండగా నిలిచిన వారికి ఎడాపెడా పదవులు పంచిపెట్టేశారు.

కేంద్రంలో కూడా శ్రీ బ్రహ్మానందరెడ్డి పలుకుబడి పెరిగినట్టు కనిపిస్తోంది. లేకపోతే, శ్రీ చెన్నారెడ్డికి కేంద్ర మంత్రివర్గంలో క్యాబినెట్ హోదాతో పదవిని ఇప్పించగలిగి వుండరు. శ్రీ సంజీవరెడ్డికి కేంద్ర మంత్రివర్గంలో స్థానం లేకపోవడానికి తన బాధ్యత ఏమీ లేదని శ్రీ బ్రహ్మానందరెడ్డి చెబుతున్నది నిజమే కావచ్చు. ఏమైనా, శ్రీ సంజీవరెడ్డి పని కొన్నాళ్ళు శూన్యంలో నిరాధారంగా ప్రదక్షిణాలు చేస్తున్న రోదసీ యాత్రికుని చందం అయింది. చివరి కాయనకు స్పీకరు పదవిని అంటగట్టారు. ఆయనఖాళీగావుంటే రాష్ట్రంలోను, కేంద్రంలోను కూడా కాంగ్రెసు పార్టీ రాజకీయాలను వాటి మానాన వాటిని ఎక్కువకాలం వదిలిపెట్టి వూరుకునే వారనుకోవడం కష్టం. ఇప్పుడు ఆయనకు అలాటి అవకాశాన్ని తొలగిస్తూ పార్టీలకు అతీతమైన పదవిని అప్పగించారు. చిత్రమేమిటంటే, ఇందుకు శ్రీ సంజీవరెడ్డి రెడీగా ఒప్పుకోవడం; కాంగ్రెసు నుంచి రాజీనామా ఇవ్వడం.

ఈలోగా ఇక్కడ రాష్ట్ర కాంగ్రెసు రాజకీయాలు ఎలా పరిణమిస్తాయో చూడవలసి వుంది. అయోధ్య వర్గీయులు తమకు చేసిన అన్యాయాన్ని సయోధ్య వర్గీయులు సహించి వూరుకుంటారా? వీరి బలం కూడా తక్కువ కాదు. శాసనసభలో ఏ అవిశ్వాస తీర్మానానికైనా వారు ఓటు చేస్తే ముఖ్యమంత్రికి ప్రమాదమే. ఈ ప్రమాదాన్ని పసిగట్టే, శ్రీ బ్రహ్మానందరెడ్డి మొన్నటి ఎన్నికలలో ఇండిపెండెంట్ల ముసుగులో ఎన్నికైన కాంగ్రెసు వాదులను కొందరిని కూడగట్టుకుని నేషనల్ డెమోక్రాట్స్ అనే ఒక వర్గాన్ని తయారు చేయించారు. వీరి మద్దత

వుంటే ముఖ్యమంత్రికి ప్రమాదం తప్పిపోతుంది. కాని, మొత్తంమీద మంత్రివర్గ వ్యవహారాలు కత్తిమీద సాము వలెనే తయారవుతాయి. ఏ క్షణంలో ఏమి ముంచుకువస్తుందో వనే భయంతో ముఖ్యమంత్రి ఎత్తుకు పై ఎత్తు వేస్తూ వ్యవహరించ వలసి వుంటుంది.

దీనివల్ల రాష్ట్ర పరిపాలన ఏ విధంగా వుండబోతుందో మనం ఊహించుకోవడం కష్టంకాదు. పార్టీ వ్యవహారాలలో, పదవులు నిలబెట్టుకునే తాపత్రయంలో ముఖ్యమంత్రికేమి, ఆయన అనుచరులకేమి క్షణం తీరిక వుండదు. పరిపాలన సౌష్ఠవం సంగతి దేవుడెరుగును! అంతకంటె పదవి ముఖ్యం కదా? అందులో కాంగ్రెసుకు ఇదే ఆఖరి ఛాన్సు కావచ్చు. కాంగ్రెసు సంగతి కూడా దేవుడెరుగును; తమకు మాత్రం ఇదే తప్పక ఆఖరి ఛాన్సు కావచ్చు. ఏమి జాగ్రత్తపడినా ఈ అయిదేళ్ళలోనే. శుభమ్!

***






# హాస్యానికి హెడ్డాపీసు

# మార్క్ ట్వేన్

"క్లాసిక్స్" అంటే చదివితే బావుందు ననిపించేవి; కాని చదవ డానికి బుద్ధి పుట్టనివి.

ఇది మార్క్ ట్వేన్ నిర్వచనం. అతడు వ్రాసిన గ్రంధాలు క్లాసిక్స్ గాని, వాటికి అతని నిర్వచనం వర్తించదు. అతని రచనలు చదివితే బావుండునని అనిపించేవి మాత్రమే కాదు, చదివేట్టు చెయ్యగలిగినవి కూడా.

మార్క్ ట్వేన్ అమెరికా లోని మిస్సూరి రాష్ట్రంలో ఫ్లారిడా అనే కుగ్రామంలో 1835వ సంవత్సరంలో జన్మించాడు. అది ఎంత కుగ్రామం అంటే, దాని జనసంఖ్య నూరు మాత్రమే ఈ విషయాన్ని వివరిస్తూ, "నేను జన్మించి మా గ్రామం జనాభాను ఒక శాతం పెంచాను. ఈ ఘనత చరిత్రలో ఎవరికి దక్కింది? బహుశా షేక్స్పియర్ కూడా తన జన్మ స్థలం జనాభాను ఒక శాతం మేరకు పెంచివుండడు" అని మార్క్ ట్వేన్ వ్రాశాడు. తను పుట్టింది అంత చిన్న పల్లెటూరని చెప్పడానికి మార్క్ ట్వేన్ ఈ ఛలోక్తిని సృష్టించాడు.

ఇటువంటి ఛలోక్తులు మార్క్ ట్వేన్ రచనలలో వందలు, వేలు కని పిస్తాయి హాస్యరచయితలలో అతడు అగ్రశ్రేణికి చెందినవాడు. రచనల లోనేకాదు; అతడు అమెరికాలోను, యూరప్ దేశాలలోను, ఇండియా లోను ఏళ్ళతరబడి ఇచ్చిన ఉపన్యా సాలలో, సంభాషణలలో ఇదే హాస్య ధోరణి వెల్లివిరుస్తుంది. అతని చమ త్కారం సాధారణంగా సున్నితంగా, అవసరమైనప్పుడు మొరటుగా, క్రూరంగా కూడా వుంటుంది. అతని రచనలన్నిటిలో మాన వునిపై ఒక వైపు ప్రేమ, మరొక వైపు ద్వేషం, ఒకవంక కరుణ, మరొకవంక క్రౌర్యం మిళితమై హాస్య రూపంలో సాక్షాత్కరిస్తాయి.

* * *

అతని మానవ ద్వేషానికి ఉదా హరణగా ఈ నిర్వచనాన్ని తీసుకో వచ్చు :

"మానవుడొక్కడే సిగ్గుపడే జంతువు. కనీసం, సిగ్గుపడవలసిన జంతువు."

* * *

మరికొన్ని నిర్వచనాలు :

"కాలేజీ చదువుకు నోచుకున్న ..బేజీనే కాలీఫ్లవర్ అంటారు."

"గుర్రపు పందాలు జరగడానికి ...ణం అభిప్రాయాలు భేదించ ..."

చొక్కా నిర్వచనం : రాళ్లు పగల గొట్టడానికి ధోబీలు ఉపయోగించే పనిముట్టు.

* * *

ఒక ఆదివారంనాడు మార్క్ ట్వేన్ చర్చికి వెళ్లాడు, ఒక ఫాదిరీ సెర్మన్ చెబుతున్నాడు. అంతా విన్న తరవాత మార్క్ ట్వేన్ ఆయన వద్దకు వెళ్ళి "ఫాదర్ ! మీ సెర్మన్‌లో ప్రతి మాట నా దగ్గరున్న ఒక పుస్తకంలో వుంది" అన్నాడు.

తాను అంత కష్టపడి తయారు చేసి ఉపన్యసించిన సెర్మన్‌ను కాపీ అంటున్నాడనుకుని ఫాదిరీ "అసంభవం" అన్నాడు.

"కాదు. నిజంగానే" అన్నాడు మార్క్ ట్వేన్.

"అయితే, ఆ పుస్తకం ఒకసారి నాకు చూపించండి."

"అలాగే" అని మర్నాడు మార్క్ ట్వేన్ ఒక లావుపాటి డిక్షనరీ ఫాదిరీకి పంపించాడు.

* * *

మార్క్ ట్వేన్ సంభాషణలో తరుచుగా అశ్లీల పదాలు వాడేవాడు ఈ చెడ్డ అలవాటును మాన్పించాలని అతని భార్య ఆలోచించింది. తాను కూడా అశ్లీలాలు మొదలు పెడితే భర్త తన అలవాటు భార్యకు కూడా అంటుకున్నదని సిగ్గుపడి అయినా మానివేస్తాడనుకుంది ఆమె ఒకనాడు భోజనాల దగ్గిర అశ్లీలాలు మాట్లాడ మొదలు పెట్టింది. కాని, మార్క్ ట్వేన్ ఆమె ఆలోచన గ్రహించాడు "నీకు మాటలు బాగానే పట్టుబడ్డాయి గాని, ఆ ఊపు రావటంలా !" అన్నాడు.

* * *

మార్క్ ట్వేన్ అమెరికన్ ఐనా అమెరికాను, దాని అనాగరిక నాగరికతను అతడు తిట్టినంతగా మరెవరూ తిట్టలేదు అయితే, ఇతరులెవరైనా తిడితే మాత్రం వెంటనే అమెరికాను సమర్థించేవాడు. ఒకసారి పారిస్‌లో ఒక పరిచితుడు అమెరికాను వేళాకోళం చేశాడట. అమెరికన్ ప్రజలందరు యూరప్ నుంచి వలస వెళ్ళినవారి సంతతే గదా ? ఈ విషయాన్ని గుర్తుకు తెస్తూ "మీ అమెరికను ఏమీ తోచనప్పుడు మీ తాత ముత్తాతలు ఎవరై వుంటారో ఊహించడం ఒక గేమ్‌గా ఆడుకుంటూ కాలక్షేపం చేయవచ్చు" అని అతడు అన్నాడట.

దానికి మార్క్ ట్వేన్ తడుముకోకుండా సమాధానమిచ్చాడు : "మీ పారిస్ వాళ్ళు ఏమీ తోచనప్పుడు

మీ తండ్రులెవరో ఊహించుకుంటూ కాలం గడపవచ్చు.

* * *

1896 జనవరిలో మార్క్ట్వేన్ ఇండియావచ్చి బొంబాయి, కలకత్తా, అలహాబాదు, లాహోరు మొదలైన చాలా నగరాలలో ఉపన్యాసాలిచ్చాడు. ఇండియా గురించి తన స్మృతులు వ్రాస్తూ భారతీయుల పట్ల తన గౌరవాన్ని, అభిమానాన్ని చాల గొప్పగా వ్యక్తం చేశాడు.

ఆగ్రా వెళ్ళి తాజ్ మహల్ చూశాడు. తాజ్ ను వెన్నెలలో చూస్తే బావుంటుందని ఎవరో చెప్పగా రాత్రి పదకొండున్నర గంటలకు వెళ్ళాడు. ఆ వేళ పౌర్ణమి పుచ్చపువ్వులా వెన్నెల కాస్తోంది. ఇంతలో దురదృష్టవశాత్తు గ్రహణం పట్టింది. అప్పుడు తనకు కలిగిన చికాకును మార్క్ట్వేన్ ఇలా చమత్కరించాడు:

"తాజ్ మహల్ కట్టిన తరవాత ఇంత ఘనగౌరవం నాకు తప్ప మరెవరికీ జరగలేదు. 1876 లో ప్రిన్స్ ఆఫ్ వేల్సు తాజ్ మహల్ ను సందర్శించిన సందర్భంలో చంద్రగ్రహణం ఏర్పాటు చేద్దామనుకున్నారు గాని సాధ్యం కాలేదు. కాని నాతోకూడా వచ్చిన కర్నల్ లాక్ (పొలిటికల్ ఏజెంట్) చాలా పలుకుబడి కలవాడు. అందుకే సరిగ్గా నేను తాజ్ ను వెన్నెలలో చూసి ఆనందించాలని వచ్చినప్పుడే సంపూర్ణ చంద్రగ్రహణం ఏర్పాటు చేశాడు."

* * *

మార్క్ట్వేన్ వ్యసనాలకు అతీతుడు కాడు. మరణానికి కొంత కాలం ముందు అతడిలా అన్నాడు: "నేను పెద్దగా ప్రయాసపడకుండానే 70 ఏళ్ళు బతికాను నా వ్యసనాలను నేను చాలా జాగ్రత్తగా పాటించేవాడిని. ఇంకొకళ్ళైతే అవి ఈ పాటికి చంపేసి వుండేవి."

ఆరోగ్యం చెడిపోనంతవరకు తాగుడు మానడం మంచిదేనని అతడొకసారి తన అభిప్రాయం వెల్లడించాడు

తనకు తాగుడు వ్యసనం వుందని అంగీకరిస్తూ ఇంకొకసారి మార్క్ట్వేన్ ఇలా అన్నాడు: "పంటినొప్పి రాకుండా వుండడానికే నేను తాగుతాను అందుకే నాకు ఒక్కసారైనా పంటి నొప్పి రాలేదు"

అన్నిట్లోకి క్లాసికల్ జోకు పొగ తాగడంపై వేశాడు "పొగ తాగడం ఎప్పుడు పడితే అప్పుడు మానగలను. ఇప్పటికి వెయ్యి సార్లయినా మానేవుంటాను."

* * *

మార్క్ ట్వేన్ 1910 లో మరణించాడు. అతడు యూరప్‌లో పర్యటిస్తుండగా పొరపాటున అతని మరణవార్త పత్రికల కెక్కింది. దానికి అతడు అసోసియేటెడ్ ప్రెస్ సంస్థకు కేబుల్ ద్వారా "నా మరణవార్త కేవలం అతిశయోక్తి" అని ఖండన పంపించాడట.

* * *

ఒకసారి ఏదో ఉపన్యాసానికి వెళ్ళినప్పుడు ఒకాయన మార్క్ ట్వేన్‌ను సభకు పరిచయం చేస్తూ "ఈయన హాస్య రచయిత ఈయన హాస్యం నవ్వు కూడా పుట్టిస్తుంది" అని చెప్పినట్లు తనే చెప్పుకున్నాడు.

నిజానికి మార్క్ ట్వేన్ హాస్యం నవ్వు కూడా పుట్టిస్తుంది. ఇలా ఎందుకు అనవలసి వచ్చిందంటే, ఉత్తమ శ్రేణికి చెందిన హాస్యం నవ్వునే కాదు; కరుణను కూడా రసీభూతం చేస్తుంది. ఈ గుణం మార్క్ ట్వేన్ రచనలలో పుష్కలంగా కనిపిస్తుంది. టామ్ సాయర్, ప్రిన్స్ అండ్ ది పాపర్, కనెక్టికట్ యాంకీ, మిస్టీరియస్ స్ట్రేంజర్ లాంటి పెక్కు నవలలు అతడు వ్రాశాడు అన్నిటిలోకి అతని కీర్తిని చిరస్థాయిగా చేసే నవల "హకల్ బెరీ ఫిన్" దానిలో అతని మానవప్రేమ, ముఖ్యంగా పీడిత మానవుల పట్ల కరుణ వెల్లివిరుస్తుంది ఇంగ్లిషు భాషలోని అతి సుందర రచనలలో అదొకటి.

***



# హరికథ

ఎంతో ముచ్చటపడి కుట్టించుకున్న బ్లాక్ డ్రెస్ వేసుకుని, ఎంబాసిడర్ బ్లాక్ బూటూ, అదేరంగు సాక్సూ ధరించి, బ్లాక్ స్పెక్ట్స్ పెట్టుకుని అలా బజారుకు బయల్దేరాడు ఓ వ్యక్తి. అనుకోకుండా అతని వాచీ స్ట్రాప్ కూడా నల్లటిదే.

అతగాడి మేనమామ '11 గంటల బస్సులో దిగుతాను' అని వ్రాయడం వల్ల ఆ టైమ్‌లో అతడు స్టాండింగ్‌కు యెండలో బయలుదేర వలసి వచ్చింది.

స్టాండింగ్ ఆవరణలో ప్రవేశించి బస్సు యింకా రాలేదని తెలుసుకొని కాంటీన్ ప్రక్కగా నిల్చున్నాడు. అందంగా కదులుతూన్న ఆడవాళ్ళు కొందరు తన వంకే చూస్తున్నారనే భావం కల్గగానే 'గేలార్డ్' తీసి ముట్టించాడు.

'బావా!' వెనకాల ఎవరో వీణ మీటారు. వెనక్కి తిరగాలనిపించింది. వెంటనే సభ్యత రెండో వైపునుండి త్రోసి కదలనివ్వలేదు.

'బావా!' ఈసారి మరీ దగ్గరగా వినిపించింది. ఆ వెంటనే ఓ లేత చివురాకు భుజంమీద తట్టింది. గిరుక్కున వెనక్కి తిరిగాడు.

'క్షమించండి!' అంటూ చూపుడు వేలును మునిపళ్ళతో కొరుక్కున్నది ఆ పల్లవపాణి. బెదరిన లేడిసల్లా చూపులు పరిగెడుతున్నాయ్.

'కుత్తుక బంటి తామరలకున్ దల ముక్కలు గండు మీలకున్' అన్న చేమకూర వాక్యానికి సరిపోయేలా వుంది ఆ ముఖం. ఆ నతముఖీ ముఖ పద్మంలో బ్యూటీ స్పాట్ మరింత నలుపెక్కింది.

'మా బావేమో అనుకున్నాను. ఆయనా ఇలాంటి డ్రస్సే వేసుకున్నారు. ఎక్స్యూజ్ మి!' అన్నది నెమ్మదిగా.

తనలాంటి బ్లాక్ డ్రెస్ అభిమాని ఉన్నాడనటంతో ఆ అజ్ఞాతవ్యక్తిమీద అభిమానం కలిగింది. అంతలోనే ఇంత అందమైన అమ్మాయికి బావ అయ్యాడే అని అంతో యింతో అసూయ కూడా అంకురించినట్లున్నది.

వెంటనే అతని కళ్ళు నలువైపులా నల్ల డ్రస్సుకోసం పరుగు తీసినై. వెనకనుండి వచ్చింది ఆ

---

మొదటి బహుమతి రు. 50


**పి. రఘురామ చక్రవర్తి**

భాషా ప్రవీణ (మూడవ సం॥)
ఎస్. బి. ఎస్. కాలేజి, పొన్నూరు
గుంటూరు జిల్లా

నల్లగుడ్డల శాస్త్రి. రావడంతోనే "ఈయనే మా బావ" అని పరిచయం చేసింది ఆమె. ఆ శాస్త్రి ఇతడి వంక చిత్రంగా చూసి తలపంకించి, ఏమిటన్నట్లు ఆమెవంక చూసింది.

"అటు తిరిగిఉంటే నువ్వనుకుని పిల్చాను వీరిని" అంతేనన్నట్లు సంజాయిషీ ఇచ్చుకున్నది.

ఆ బావ ఈ వ్యక్తివంక తీవ్రంగా చూశాడు. "ఏమిటీ వెధవ చూపు?" అందామనుకున్నాడుగాని, ఆ అమ్మాయి నొచ్చుకుంటుందేమోనని ఆగిపోయి వెనక్కి తిరిగి నాలుగడుగులు వేశాడు.

"ఏయ్, మిస్టర్!" ఆ బావ తాలూకు గొంతు ఇతగాణ్ణి వెనక్కి పిల్చింది ఎక్కడో విన్నట్లు గొంతుని గుర్తు తెచ్చుకుందామని ప్రయత్నించి దగ్గరగా వచ్చేడు.

ఆ బావగారు నవ్వుతూ, "ఏరా, హరీ! ఇంకా నన్ను గుర్తుపట్టలేదుట్రా?" అని గట్టిగా కావలించుకున్నాడు.

అప్పుడు గుర్తు వచ్చేడులా ఉంది మూర్తి.

"రేయ్! మూర్తీ! నువ్వుట్రా?" అని ఆనందాతిరేకంతో మూర్ఛపోయినంతగా ఆశ్చర్యపోవడం మినహా మరేం చెయ్యలేకపోయాడు హరి.

"వీడు బి. ఎ. లో నాక్లాస్ అండ్ రూమ్‌మేట్. పేరు శ్రీహరి – ఈ అమ్మాయి నా మరదలు, ప్రమీలా నామ విభ్రాజిత" అని పరస్పరం పరిచయవాక్యాలు పలికాడు మూర్తి.

కాస్సేపట్లోనే వాళ్ళలో, వాళ్ళ మాటల్లో కలిసిపోయేడు హరి.

"మీరు మాట్లాడుతూ ఉండండి, ఇప్పుడే వస్తాను" అంటూ ఉన్నట్లుండి చటుక్కున రంగంలో నుండి మూర్తి నిష్క్రమించేడు.

కాస్సేపు ఇద్దరూ మౌనంగా ఉండిపోయేరు.

"మీరేం చేస్తున్నారండీ?" ఆమే ప్రశ్నించింది.

"పెద్దలు సంపాదించి పెట్టిపోయిన దాన్ని సద్వినియోగం చేస్తున్నాను – మరి మీరేం చేస్తున్నారు?"

"విజయవాడ స్టేషన్‌లో మీతో మాట్లాడుతున్నా..." అని కిలకిలా నవ్వి, "మా ఊరు" అంటే గుంటూరులో "ఉమెన్స్ కాలేజీ"లో పి.యు.సి. చదువుతున్నాను." అన్నది.

"అయితే మీ వివాహమెప్పుడు?" ఇందాకటినుండీ కుమ్మరి పురుగులా మనస్సుని తొలిచేస్తున్న సందేహాన్ని బయట పెట్టేశాడు.

"అంతా నిర్ణయించినట్లే, "ఎప్పుడూ" అని అడుగుతున్నారే? మంచి చమత్కారులే మీరు!" అన్నది ప్రమీల అదోరకంగా పెదవి విరిచి

"నిర్ణయించే దేమిటండీ, మూర్తి లేడూ ?" అన్నాడు కనిపించే ఆశా కిరణాన్ని పట్టుకు వ్రేలాడుతూ ఆ కిరణానే మెర్క్యురీ బల్బులా వెలిగింది

"మా బాపకి పెళ్ళయిపోయి ఏడాది దాటింది పెళ్ళిమీద పెళ్ళికి, మీరు నిర్ణయించినా, ఆయన తలూపినా చట్టం అంగీకరించదండీ హరిగారూ !" అన్నది ఆ అబలామణి

ఎగిరి గంతువేద్దామనుకున్నాడు హరి వెంటనే అతగాడి బి ఎ అనే రెండు అక్షరాలూ నెత్తిన మొట్టి ఆపినై

ఇంతలో మూర్తి ఒక ప్లాస్టిక్ బుట్టలో డజను యాపిల్ పళ్ళు పెట్టుకొని వచ్చేడు. అతణ్ణి చూడగానే చొక్కా పట్టుకుని రెండూ పళ్ళూ పీడు శ్రీహరి పళ్ళు కొరుకుతూ

"యూ ఫూల్, రాస్కెల్ అని మొదలుపెట్టి తనకు తెలిసినంత వరకు ఇంగ్లీషులో ఉన్న తిట్లన్నీ లిట్టేశాడు హరి

ఆ సమయంలో మూర్తి ముఖంలో మారిన రంగులు చూపడం "రవి కాంత్"కు గూడా సాధ్యంకాదేమో ననిపించింది



ప్రమీల గూడా బిత్తర పోయింది హరి వాలకానికి

అతడి షర్టు వదిలేసి, "లేకపోతే పెళ్ళి చేసుకుంటూ "ఇన్విటేషన్' గూడా పంపవన్నమాట – జాగ్రత్త, హరి అంటే ఏమనుకున్నావో హు!" అన్నాడు కాలర్ పైకెత్తి

మూర్తి తేరుకుని, "ఆ మాటలు చెప్పి, చేతికిద్దామనే ఇవి పట్టు కొచ్చాన్రా!" అంటూ పళ్ళ బుట్ట చేతికిచ్చాడు

ఇంతలో గుంటూరు బస్సు వచ్చింది

"ఒరేయ్, హరీ! వీలుచూసుకుని గుంటూరు రారా, నువ్వు జీవితంలో మరచిపోలేని మాంచి ప్రజెంటేషన్ ఇవ్వాలనుకుంటున్నాను" అని ప్రమీల వంక చూసేడు. ప్రమీల, హరి పరస్పర విలోకన క్రియా తత్పరులై ఉండటం చూసి నవ్వుకుంటూ బుకింగ్ వైపు నడిచాడు మూర్తి

* * *

మర్నాడు ప్రమీలకోసం గుంటూరు వెళ్ళాడు హరి ఇద్దరూ కలిసి పార్క్‌కు వెళ్ళి ఒక మూలగా పచ్చికమీద కూర్చున్నారు

"ఎప్పుడూ నన్ను విడిచి వుండవు కదూ ?" అన్నాడు హరి, జంటగా సమీపంలో తిరుగుతున్న గోరువంకలను చూస్తూ, ఆమె వీపుకు తన వీపు ఆన్చి.

"ఎప్పటికీ నేను మీదాన్ని అన్నది ప్రమీల చేతిలో వున్న క్రోటన్స్ ఆకుని రెండుగా చీలుస్తూ

తనమీద పూర్తిగా హరి ఆధారపడి ఉన్నాడని తెలిసినా, ఎందుకో ఒక్కసారి ప్రక్కకు జరిగింది చిలిపిగా ప్రమీల

"ప్రమీలా!" అని అరిచాడు వెనక్కి వ్రాలుతున్న హరి, హఠాత్తుగా ఆమె విడిచి పోతున్నట్లు ఫీలవుతూ

* * *

స్వప్నలోకంలో లేకుండానే "ప్రమీలా!" అని భార్యని కలవరిస్తూ ప్రక్కమీదనుండి లేస్తున్న శ్రీహరిని అదిమి పట్టారు, మందివ్వటానికి వచ్చిన నర్సూ, కాంపౌండరూ

ప్రేమించి పెళ్ళాడిన భార్య నెల రోజుల క్రితం మరణించింది ఆ దిగులుతో మంచం పట్టిన కొడుకు కలవరింత కొంచెం దూరంలో కూర్చుని దుఃఖిస్తున్న కన్నవాళ్ళ గుండెల్ని నిలువునా చీల్చేసింది

ఇంతలో డాక్టర్ వచ్చి చెయ్యి పట్టుకుని శ్రీహరి నాడి పరికిస్తూ, మొహం వంక చూశాడు శ్రీహరి ప్రశాంతంగా ఉన్నాడు ఆయన నిశ్శబ్దంగా చెయ్యి వదిలేసి గొంతు వరకూ కప్పివున్న దుప్పటిని తల వరకూ కప్పి గబగబా వెళ్ళిపోతూ "అయిపోయింది" అని గొణుక్కున్నాడు

***

# వివాహం కుదిరింది

"అయితే మీకూ పెళ్ళి కావల
సినఅమ్మాయి ఉందన్నమాట"
ఎదుటి పెద్దమనిషి ప్రశ్నకి అవునన్నట్లుగా తలాడించాడాయన

మనిషి చూడబోతే చాలా హుందాగా వున్నాడు గ్లాస్కోపంచ, లాల్చి, రిమ్‌లెస్ కళ్ళద్దాలు

ఎంత సేపటినుండో చూస్తున్నా ఎదుటి పెద్దమనిషి ఊరికే తనస్వంత డబ్బా వాయించేసు కొంటున్నాడు తనకి పెద్దకారు, అందమైన రామ్మోహన్ లాటి అబ్బాయీ (ఊరికే ఉండడంగాదు ఏదో పెద్ద ఉద్యోగం చేస్తున్నట్టుకూడా) యింకా ఎన్నో ఉన్నాయిట లాయర్‌గా అయన సంపాదించిన డబ్బు దేశంలో మరే లాయరూ జన్మలో సంపాదించలేడట

ఈ రెండో పెద్దమనిషి బుట్టలో పడ్డట్టున్నాడు మెల్లగా సంభాషణలోకి జొరబడ్డాడు వాళ్ళ సంభాషణబట్టి ఈయనకొక గ్రాడ్యుయేట్ అమ్మాయి ఉన్నట్లూ, ఆమెకు వివాహం కావలసి ఉన్నట్లూ తేలింది

నాకు కుతూహలం కలిగింది ఎందుకంటే మన దేశంలో పెళ్ళిళ్ళు కుదరడం అనేది చాలా విచిత్రంగా జరుగుతుంది విశాఖపట్నంలో అబ్బాయీ, ఢిల్లీలో అమ్మాయీ ఎలా జోడు కుదుర్తారో వింతగా ఉంటుంది

"అయితే మీ మేడ చాలా పెద్దదన్నమాట" ఎదుటాయన ఆశ్చర్యంగా ప్రశ్నించాడు

"పెద్దదా మెల్లగా అంటారేమిటా మాట ? నా చెమటోడ్చి సంపాదించిన డబ్బుతో కట్టా నా మేడని రెండు లక్షలు దరిదాపు ఖర్చయింది మూడంతస్తులకి అద్దెకివ్వరాదా అని ఎంతోమంది ఒడుగుతున్నారనుకోండి వెధవ అద్దె మనకి సుఖం ఉండదు నాన్నా అని మావాడే ఉంచేయమన్నాడు ఐనా శంకర్రావుగారి మేడంటే మీకే తెలుస్తుందిగా మా వూరు వచ్చినప్పుడు"

"ఏ ఊరన్నారూ?" మొదటాయన ప్రశ్నకి "ఏమీ అనలేదండీ" అని పాత జోక్ వేయకుండా ఊరిపేరు చెప్పాడాయన

"అబ్బా" అన్నాడు ఎదుటాయన అదేదో ప్రపంచ వింత అయినట్లు

"అన్నట్లు మీ అమ్మాయి తెల్లగా ఉంటుందా ? మా వాడికి తెల్లగా ఉంటేకాని నచ్చరులెండి ఇప్పటికే ఎందరో వస్తున్నారు ఒకాయన లక్షా

రెండవ బహుమతి రు. 25

**పి. వెంకటేశ్వరరావు**

ఎమ్ ఎస్ సి (ఫైనల్)
కెమిస్ట్రీ (ఇనార్గానిక్)
ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాల
వాల్తేరు.

ఖైవేలా యిస్తామన్నాడు కాని చూడండి ! అమ్మాయి అంత తెలువుకాదు" జేబులోంచి సిగరెట్ పెట్టె తీసి సిగరెట్ వెలిగించాడు శంకర్రావుగారు.

"ఏదోలెండి. మా అమ్మాయిని నేను పొగడకూడదు కాని... నా రంగులో ఉంటుంది" మందహాసంతో ఎదుటాయన అన్నదానికి పగలపడి నవ్వాడు శంకర్రావుగారు, "బలే జోక్ వేశారే" అన్నట్లు. నిజానికి ఆయన చాలా నల్లగా ఉన్నాడు.

"శంకర్రావుగారూ !" ఆరంభించాడు ఎదుటాయన "నా పేరు రాజశేఖరం. మా అమ్మాయిని మీ వాడికి చూపి నచ్చితే మీతో వియ్యం పొందాలని వుంది. ఎందుకంటే మీరు నా కెంతో నచ్చారు."

ఇక శంకర్రావుగారు విజృంభించారు. తన స్థిరచరాస్తుల వివరాలూ, సంపాదించిన డబ్బూ (బ్లాక్-వైట్) అన్నీ పూసగుచ్చి మెడలో వేసినంత పొందిగ్గా చెప్పాడు. ఎందుకంటే వివాహ విషయాల్లో ఎదుటివారికి అధికులుగా కనబడాలి.

అంతా చెప్పేసి "మీకు స్వంత యిల్లు వుందా ?" అన్నాడాయన. అది లేకపోతే తనతో మాట్లాడడానికే అనర్హుడు అన్నట్లు.

ఎదుటి పెద్దమనిషి దెబ్బతిన్నట్లున్నాడు, "క్షమించండి. ఆ వేమీ నాకు లేవు కాని మా అమ్మాయి మాత్రం బుద్ధిమంతురాలు."

"ఎవరు. కాదండీ. ఈ రోజుల్లో ఆస్తిలేని పిల్లనెవరు చేసుకుంటారు చెప్పండి? ఈ కాస్ట్లీ సొసైటీలో జీవితమే దుర్భరం."

ఇంకా ఆయన ఉపన్యాసం అలా కొనసాగును కానీ యింతలో సినిమాలోలా ఒక వింత జరిగింది.

"శంకర్రావుగారూ ! మీరు ఇన్‌కం టాక్స్ ఎంత కడుతున్నారు" రాజశేఖరంగారి పక్కనే ఉన్న జమాజెట్టి లాటి మనిషి ప్రశ్నించాడు.

శంకర్రావుగారు తెల్లబోయారు ఒక్క క్షణం. కాని వెంటనే తేరుకొని "దటీజ్ నన్ ఆఫ్ యువర్ బిజినెస్" అన్నారు కోపంగా.

"కాదు. అవసరమే" రాజశేఖరంగారు మందహాసంతో అన్నారు

"క్షమించండి. మా అమ్మాయికి ఆరు సంవత్సరాల క్రితమే పెళ్ళయింది. ప్రస్తుతం నేను గవర్నమెంట్ తరఫున ఇన్‌కమ్‌టాక్స్ ఎగ్గొడుతున్న వారిని పట్టడానికి బయలుదేరాను. ఈ రోజుకి మీరు మొదటివారు. మీమీద అనధికారంగా వచ్చిన రిపోర్టుల ననుసరించే ఇలా ప్లాన్ వేయాల్సి వచ్చింది. అది మరచాను. మీ సంభాషణ అంతా రికార్డయిందని మాత్రం మరవకండి."

నా ఆశ్చర్యానికి మేరలేదు. వివాహాలు ఎలా కుదుర్తాయో చూడకపోయినా నేరస్థుల్ని పరిశోధకులు ఎలా పట్టుకొంటారో చూడగలిగాను. ఇంతకూ పాపం వివాహం కుదిరింది శంకర్రావుగారి అబ్బాయికి కాదు, ఆయనకే !

***

జ్యోతి

# 'దొంగ... దొంగ... పట్టుకోండి!'

ఒగర్చుకుంటూ అప్పుడే బయలు దేరుతున్న "హైదరాబాద్ ఎక్స్ ప్రెస్"లో ఎక్కాడు రాములు. గుండె ఇంకా దడ దడమని కొట్టుకుంటునే వున్నది. "దొంగ... దొంగ పట్టుకోండి!" అన్న కేకలు ఇంకా చెవిలో మారుమ్రోగి పోతున్నాయి. తను తప్పేం చేశాడు? నలుగురి దృష్టిలో "దొంగ" అయినాడు. కొన్ని గంటల ముందు జరిగిన సంఘటనలు గుర్తుకు రాసాగాయి.

రాత్రి తొమ్మిదవుతుంది. ఇంకా సినిమా వదల పెట్టలేదు. రిక్షా రోడ్డు పక్కకు తోసి, రోడ్డు మీద నిలబడ్డాడు రాములు.

'ఏయ్ రిక్షా! మూర్తి మహల్ కొస్తావా?' అడిగాడు ఒక పెద్ద మనిషి.

"ఎక్కండి బాబూ!" అన్నాడు రాములు.

మూర్తి మహల్ దగ్గర దిగి, "మళ్ళీ యిప్పుడే వస్తాను" అంటూ బాడుగ ఇవ్వకుండా లోనికి వెళ్ళాడతను.

"సెంటర్‌కు పోనీయవోయ్!"

వెనక్కి తిరిగి చూశాడు రాములు. రిక్షాలో ఎవరో కూర్చుని వున్నారు.

"రానండీ ... బాడుగ వుంది" అన్నాడు రాములు. రిక్షాలో కూర్చున్న తను దిగి, వెళ్ళిపో సాగాడు అతను దిగుతుంటే ఏదో కాగితం సీటు మీద నుండి క్రింద పడటం చూశాడు రాము.

వంద రూపాయల నోటు!

రాములు మనస్సులో అనేక మయిన ఆలోచనలు పరుగులెత్తి నాయి. చివరకు అతనిలోని న్యాయ బుద్ధే గెలిచింది.

"ఏమండోయ్!"

వెళ్ళుతున్నతను వెనక్కి తిరిగి చూశాడు.

"ఇదిగో నండి, మీ డబ్బు రిక్షాలో పారేసుకున్నారు."

అతను అయోమయంగా చుట్టూ చూశాడు.

---

రెండవ బహుమతి రు 25

## అలపర్తి రామకృష్ణ

బి. ఏ. (మొదటి సం॥)
పి. బి. ఎన్ కాలేజి,
నిడుబ్రోలు, గుంటూరు జిల్లా

---

రాములు చేతిలో ఒక పది రూపాయల నోటుపుంచీ, ఆ వంద రూపాయలుతీసుకొనివడివడిగా అడుగులు వేసుకొంటూ వెళ్ళిపోయాడు

రాములు పది రూపాయల నోటును ఆనందంగా జేబులో పెట్టుకున్నాడు

సినిమా వదిలిపెట్టారు

రాములు రిక్షాదగ్గరకు వచ్చాడు అంతకుముందు ఎక్కినాయన రిక్షా దగ్గర నిల్చుని, రిక్షా పరీక్షిస్తున్నాడు రాములు ఆయన దగ్గరకెళ్ళాడు

"ఒరేయ్, నా వందరూపాయలు పోయినాయి, నీవేమన్నా తీశావా?" అంటూ రాములు జేబులో చెయ్యి పెట్టాడు. పది రూపాయల నోటు తగిలింది చేతికి రిక్షావాడి మీద అనుమానం వచ్చింది ఆయనకు పెద్దగా కేకలు వెయ్యటం మొదలు పెట్టాడు

"ఒరేయ్ నువ్వే కాజేశావ్ మిగతా డబ్బులేవి? చెప్పు"

రాములుకు భయం పుట్టింది ఆయన్ని విదుల్చుకొని అక్కడనుంచి పరుగెత్తాడు

"దొంగ దొంగ పట్టుకోండి!" అంటూ వెంటబడ్డాడు పెద్దమనిషి

జరుగుతున్న సంఘటనను చూస్తూ "అద్దెరిక్షా" మౌనంగా నిలబడిపోయింది

***



# పరివర్తన

థియేటర్ అంతా జనంతో నిండి ఉంది. పావుగంట ఆలస్యంగా మిలిటరీ దుస్తులలో వచ్చిన శంకరానికి బ్యాటరీలైటు వేసి చూపిస్తున్నా సరే, సీటు వెతుక్కోడం కష్టమయింది. తడబడుతూ, కాళ్ళు తొక్కుకుంటూ చివరికి సీటులో చతికలపడ్డాడు. ప్రేక్షకులందరూ ఏకాగ్రతతో తెరమీద కథలో నిమగ్నులై ఉన్నారు. బరువుగా విడుస్తున్న వాళ్ళ ఊపిరి చప్పుడు శంకరానికి వింతగా తోచింది. తెరమీద మంచు దట్టంగా కప్పిన పట్టణంలో ఒక భాగం. ఓవర్‌కోట్లు వేసుకున్న వ్యక్తులు రోడ్డు మీద మంచులో స్పష్టాస్పష్టంగా గోచరిస్తూ నడుస్తున్నారు. ఒక చర్చి కిటికీలోంచి ముసలివాడు నిర్లిప్తంగా మంచునీ మనుష్యుల్నీ పరికిస్తున్నాడు. హఠాత్తుగా పిస్తోలు పేలిన చప్పుడు రోడ్డుమీద ఒక్కడు "అబ్బా" అంటూ ఒరిగాడు బూట్ కాళ్ళు కలదొక్కుకుంటూన్న చప్పుడు... శంకరం చేతిమీద ఎవరిదో మెత్తని చేయిపడింది. శంకరం పక్కకి చూశాడు. ఒక యువతి చప్పున చేయి తీసేసుకుని "సారీ" అని తెరవైపు చూస్తూవుంది.

## బాలగంగాధర తిలక్

హిచ్‌కాక్ పిక్చర్ యొక్క ప్రభావం అనుకున్నాడు శంకరం ఆమె కలవరపాటు చూసి అతనికి కథ అర్థం కావడం లేదు, ఆలస్యంగా రావడం మూలాన. అయినా శ్రద్ధగా తెరమీదకి చూస్తున్న అతనికి ప్రక్కనున్న యువతి తనవైపే చూస్తున్నట్టు అనిపించింది. నిశితంగా వెచ్చగా తనకి ఆ చూపులు తగులుతూన్నట్టు ఉంది శంకరానికి. ఆమెవైపు చూడాలనుకుని కూడా అతను కుతూహలాన్ని అణచుకున్నాడు. ఇంతలో ఆ యువతి ఏడుపును నొక్కిపట్టిన సన్నని ధ్వని ఆగి ఆగి అతనికి వినపడింది. వింతగా ఆమెవైపు చూశాడు. పరీక్షగా నిదానంగా చూశాడు. రాజేశ్వరి శంకరం వొళ్ళూ మనస్సూ ఒక్కసారిగా వేడిగా కంగారుగా అస్తిమితంగా అయిపోయింది కొంతసేపటికి తమాయించుకొన్నాడు. ఆమె చేతిమీద చెయ్యివేసి "రాజీ" అన్నాడు మెల్లగా.

"బాగున్నావా" అంది రాజేశ్వరి నిట్టూర్పుని, మాటల్నీ నొక్కిపట్టి శంకరం చేతినుండి ఆమె తన చేతిని మెల్లగా తీసేసుకుంది. ఇద్దరు

ఓ ఐదు నిమిషాలపాటు నిశ్శబ్దంగా ఉన్నారు. వాళ్ళు తెరవైపే చూస్తున్నారు గాని వారిదృష్టి అటులేదు. థియేటరులో వెచ్చబడిన చీకటికన్న దళసరైన ఉద్రేకం వారిరువురినీ చుట్టుకుంది.

"నీతో మాట్లాడాలి" అన్నాడు శంకరం గొంతును బాగా తగ్గించి. ఆమె పెద్దవయిన తెల్లని కళ్ళతో అతనికేసి చూసింది.

"బీచికిపోదాం వచ్చెయ్యి" అన్నాడు శంకరం. ఆమె తల ఊపింది. ఇరువురూ లేచి అడుగులో అడుగు వేసుకుంటూ థియేటరు బయటకి వచ్చేశారు. విద్యుద్దీప కాంతిలో ప్రౌఢంగా అందంగా ఆకర్షణీయంగా ఉన్న ఆమె ముఖాన్ని, అవయవాల్నీ తేరిచూస్తూ నిలుచుండిపోయాడు శంకరం. రాజేశ్వరి కొంచెం కలవరపడినవ్వి "ఏమిటీ వాలకం, రాపోదాం" అందో శంకరం అనుసరించాడు.

ఆమె కారువద్దకు వచ్చింది లోపల స్టీరింగు దగ్గర కుర్చుంటూ "ఎక్కడికి పోదాం" అంది అతను ఎక్కి కూర్చోగానే.

"డ్రైవర్ లేడా ?"

"పొమ్మన్నాను, సినిమా వదిలే సమయానికి వస్తాడు."

"మరి—"

"ఇక్కడ లేకపోవడం చూసి యింటికి వస్తాడు"

"మీ ఆయన ?"

నవ్వ్వందిరాజేశ్వరి. "ఊళ్ళో లెరు. క్యాంపుకి వెళ్ళారు" ఓసెకను ఆగి మళ్ళా యిలా అంది "ఉంటేమాత్రం? వారికి నా మీద నమ్మకము..."

శంకరం నిట్టూర్చాడు. అదే పట్టుదల, అదే వ్యక్తిత్వం, అదే స్వతంత్రం ఈ రాజేశ్వరిలో అనుకున్నాడు అతనికి జరిగి పోయిన సంఘటనలు జ్ఞాపకం వచ్చాయి. రాజేశ్వరీ, తనూ గాఢంగా ప్రేమించుకున్నారు బాల్యంనుండీ. కొనదేరిన ముక్కుతో పెదవి ఎఱ్ఱనివంపులో ఒక పట్టుదలా, వెడల్పాటి కళ్ళల్లో తెలివైన వెలుతురూ, వెన్నెల పాలరాతి శిల్పం మీదపడి జారిపోతున్నట్టుగా అనిపించే అవయవలావణ్యమూ — రాజేశ్వరి అతన్ని స్వప్నంలో స్వగతంలో ఆక్రమించుకుంది. అతని బతుక్కి ఒక అర్థాన్ని ఆవేశాన్ని గమ్యాన్నీ యిచ్చింది. ఇరువురిస్నేహాన్నీ చనువునీ ఎవరూ అడ్డుపెట్టలేదు, తప్పుగా తీసుకోలేదు. వారి కుటుంబాల మధ్య ఉన్న సాన్నిహిత్యమే అటువంటిది. అదే కాదు, వారిరువురూ భార్యాభర్తలౌతారనే అనుకున్నారందరూ. ఆమె ఆనర్సు చదవడానికి దూరం వెళ్ళింది. తాను ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాడు. ఆమె సెలవులకి వచ్చినప్పుడల్లా కలసి కొనేవాడు. గంటలకి గంటలు కబుర్లు చెప్పుకొనేవారు. సినిమాలకి వెళ్ళేవారు రాజకీయాల్నిగురించీ సాంఘిక వ్యవస్థల్నిగురించీ విశ్వాసాలగురించీ.



చర్చించుకునేవారు. ఆమె తెలివైనది. ఎటువంటి సమస్యనీ ప్రాక్టికల్‌గా ఆలోచించి తూచి నిర్ణయం చేయగల శక్తి ఉందిఆమెకు. ఆమె ఉద్రేకానికి లోనుకాదు. దాన్ని శాసించగలదు బుద్ధి యొక్క అదుపులో ఆవరణలో ఆమె ఉద్రేకాలు నిలచి ఉంటాయి. అందుకే ఆమె తననీ, తన జీవితాన్నీ, తన భవిష్యత్ కుటుంబాన్నీ అందంగా ప్రయోజనకరంగా సుఖవంతంగా తీర్చి దిద్దగలదని అతను నమ్మాడు.

ఫైనలియరు పరీక్షలువ్రాసి చదువుతో, వయస్సుతో మరింతపొడుగ్గా అందంగా పెరిగిన రాజేశ్వరి తనని ఏకాంతంగా పిలచి, "శంకరం నిన్ను నేను పెళ్ళి చేసికోను." అని చెప్పినపుడు అతను నమ్మలేక పోయాడు. ఆమె ఒక్కొ

క్కచే కారణాలు వికటీకరిస్తూంటే ఒక్కొక్క నిలువులోతులోపలికంటూ అధఃపాతాళానికి అంధకార సముద్రంలోకి అతను మునిగి పోయాడు. అతనికి తన జీవితాన్ని ఎవరో సగానికి నిర్దయగా చీల్చి రెండుముక్కల్నీ చెరోవైపుకీ విసిరేసినట్టు అనుభవం పొందాడు. చివరికి ఆమె తండ్రి కూడా అన్నాడు 'మనం ఎరిగున్న శంకరాన్ని కాదని ఆ నారాయణరావుని పెళ్ళి చేసుకోవడం అన్యాయం అమ్మా' అని.

ఆమె వినలేదు. నారాయణరావు బాగా డబ్బున్నవాడు. పెద్ద చదువు చదివాడు.. పెద్ద ఉద్యోగంలో ఉన్నాడు. వీటితో పాటు మంచి ఆరోగ్యమూ, రూపమూ ఉన్నవాడు. అతనంటే యిష్టపడింది. అతనికి మాట యిచ్చింది. ఇంతగొప్ప అవకాశాన్ని జారవిడచుకోవడం – ఒక బాల్య చాపల్యాన్ని నమ్మి, ప్రేమ అనే పదంపన్నిన యింద్రజాలంలో చిక్కుకుని–పోవటం తెలివితక్కువ. మానవుడికి బుద్ధి, హేతువు వున్నందుకు ఉపయోగం ఏమిటి? ఇదీ ఆమె వాదం.

తండ్రికి ఆమె పట్టుదల తెలుసును 'నీ యిష్టం తల్లీ. నీసుఖమే నాకు కావలసినది' అన్నాడు. తాను ఆ సాయంత్రం తోటలో మునిమాపు వేళ కలుసుకున్నాడు. చీకటి తన మనసులోని దిగులులా వ్యాపిస్తుంటే, గాలి చెట్ల ఆకులలో ఏడుస్తూంటే ఆమెతో అన్నాడు 'నువ్వులేని బ్రతుకు ఊహించుకోలేను రాజీ! బతకలేను. నాగుండె పగిలి పోతుంది రాజీ.'

"ఇది బలం లేని వాళ్ళ మాటలు. ధైర్యం స్థయిర్యంలేని వాడవు నన్ను పెళ్ళి చేసుకొని ఏం నిర్వాకం చెయ్యగలవు శంకరం? జీవితాన్ని, జీవితంలో కలిగే సంఘటనలనీ ఎదుర్కోలేని పిరికితనం నాకసహ్యమని తెలుసుగా! నువ్వంటే నాకున్న అభిమానమూ యిష్టమూ కూడా యిటువంటి మాటలతో తుడిచి వెయ్యకు' అంది రాజేశ్వరి.

ఆమె పెళ్ళికాకముందే తాను మిలటరీలో చేరాడు. మళ్ళీ యిన్నేళ్ళకి కలుసుకున్నాడు. శంకరానికి కారుదిగి రాజేశ్వరితో బీచ్ వొడ్డున

కూర్చోడం కూడా ఎరుగడు యీ ఆలోచనలతో. అతను ఎంతో బలవంతాన తన హృదయంలోని ఉద్రేకాల్ని అణచుకుంటున్నాడు. అక్కడక్కడ జనం జంటలుగా గుంపులుగా బీచ్ వొడ్డంతా ఉన్నారు. దశమినాటి వెన్నెలపడి సముద్రం అలలతో నురుగులతో గంభీరంగా మనోహరంగా ఉంది.

"నువ్వు సుఖంగా ఉన్నావా రాజీ" అన్నాడు శంకరం.

"ఆఁ! నన్ను చూస్తే తెలియటం లేదూ" అని నవ్వింది రాజేశ్వరి

"మరి థియేటరులో నన్ను చూసి ఏడ్చావెందుకూ! నువ్వు ఏడ్చినట్టు నాకు తెలుసును"

"అవును. నిన్ను చూడగానే ఏదో బాధ కలిగింది. నావల్ల నువ్విలాగ అయిపోయావు కదా అని బాధ" ఆమె గొంతు మృదువుగా జాలిగా వుంది.

"అంతేనా రాజీ! ఒట్టి బాధేనా?" అతను ఖంగారుగా అడిగాడు.

"కాదు శంకరం. నువ్వంటే నాకు అభిమానమూ ఉంది. నిన్నెప్పుడూ మర్చిపోలేదు..."

శంకరం హృదయం ఆనందంతో నిండిపోయింది. ఆమె చేయి పట్టుకుని "రాజీ నన్ను ప్రేమిస్తున్నావా?"



మరి నీభర్త...' అంటూంటే ఆమె నవ్వి యిలా అంది "ఇలా తొందరగా నిర్ణయాలకి వచ్చేస్తావు నువ్వు శంకరం! నాభర్తని కోరి పెళ్ళి చేసుకున్నాను. సుఖపడ్డాను, అన్నీ విశాలా."

శంకరం తెల్లబోయాడు. తననిర్ణయం తప్పనీ, తాను సుఖ పడడం లేదనీ తనవొళ్ళో ఆమె తలదూర్చి ఏడవాలని అతని రొమాంటిక్ ఉద్దేశం. కాని నిశ్చలంగా అందంగా నిండుగా ఉన్న ఈ రాజేశ్వరి తన మీద స్నేహ భావాన్నీ జాలినీ మాత్రమే ప్రదర్శిస్తోంది.

ఇరువురూ కొంతసేపు మౌనంగా కూర్చున్నారు. రాజేశ్వరి దీనంగా వున్న శంకరాన్ని చూసి మళ్ళీ జాలిగా అంది. "నువ్వు పెళ్ళిచేసుకో లేదు కదూ?"

"లేదు."

"చేసుకోవా శంకరం?"

"ఊహూఁ"

వెన్నెల వెలుగులో శంకరం కళ్ళు తడితడిగా ఉండడం ఆమె చూసింది. "ఎవరిమీద నీకోపం శంకరం? వెర్రి నాయనా, నువ్వు పెళ్ళిచేసుకొంటే నీ జీవితం మారిపోతుంది. నీకు ఒక గమ్యం ఏర్పడుతుంది. నామాట వినవా?" అంది బతిమాలుతూన్న గొంతుతో.

"నీ బొమ్మ ఈ మనసులోంచి చెరిగిపోదు రాజీ. అంతవరకు పెళ్ళాడలేను" అన్నాడతను బరువుగా గాద్గదికంగా.

రాజేశ్వరి తలతిప్పుకుంది. ఆను కలో చూపుడువేలుతో వలయాలు గీస్తోంది. ఆమె కన్నులలో క్రమ్మిన నీరు శంకరం చూడకూడదని ఆమె ప్రయత్నం. కొంతసేపటికి తేరుకొని వెన్నెలలాగ నవ్వి "సరే నీ మిలిటరీ కబుర్లు చెప్పు. ఇప్పుడు నువ్వు బ్రిగేడియర్‌వా? జనరల్‌వా?" అంది.

"మేజర్ని."

శంకరం తన అనుభవాలు చెప్ప సాగాడు. ఆమె శ్రద్ధగా వింది. బీచ్‌లో జనం బాగా పల్చబడ్డారు. సముద్రపు అలలు యింకాకటికన, కోపంగా బలంగా వొడ్డుకు తగిలి విరుగుతున్నాయి. ఆమెలేచి "ఇక పోదామా" అంది.

శంకరం ఆమెను అనుసరించాడు.

కారు నడుపుతున్న రాజేశ్వరి రేగిన ముంగురుల్నీ అవయవాల వయ్యారాన్నీ ఎర్రని పెదవుల్లోని తియ్యని పట్టుదలనీ చూస్తూ కూర్చున్నాడు శంకరం. అతనిలో ఏదో కోరిక బలవత్తరమై నరనరాలలో మూ వెచ్చగా పదునుగా వ్యాపించింది.

"ఇదే నా హోటలు. ఇక్కడాపు రాజీ" అన్నాడు శంకరం. రాజేశ్వరి కారు ఆపింది.

"ఒకసారి నారూమ్‌కి రారాదూ. ఓ నిమిషం కూర్చుని వెళుదువుగాని" అన్నాడు శంకరం.

"ఆలస్యమై పోయింది."

"భయమా రాజీ" అన్నాడు శంకరం.

"నువ్వంటేనా? నీ దగ్గరా నాకు భయంటే?" అంది రాజేశ్వరి నవ్వి.

"అయితే ఓసారి వచ్చివెళ్ళు"

రాజేశ్వరి కారుదిగి అతని వెనకాలే వెళ్ళింది. రూములో ఆమెని సోఫాలో కూర్చోపెట్టి "ఇప్పుడు నువ్వు నా అతిధివి. ఏదైనా తీసుకోవూ" అన్నాడు.

"ఇప్పుడేమీ వద్దు. అరె! టేబిలు మీద ఉంది నా ఫోటోయే!"

"అవును నిన్ను నిత్యం చూస్తూ ఉండాలి రాజీ" శంకరం నవ్వాడు "నేఫా యుద్ధంలో బ్రతికి తిరిగి వస్తానని అనుకోలేను. అప్పుడుకూడా నీ ఫోటో నా జేబులోనే ఉంది" అన్నాడు.

రాజేశ్వరి ఆ ఫోటోని పరీక్షగా చూసి "ఎంత చిన్నదాన్నో అప్పుడు. ఎనిమిదేళ్ళు జరిగిపోయాయి" అని నిట్టూర్చింది.

అల్మారాలోంచి బ్రాందీ తీసి టేబులుమీద పెట్టి "ఎనిమిదేళ్ళు నాకు ఎనిమిది యుగాలు. నీకు క్షణంలో జరిగిపోయినట్టు ఉంది. అయినా రాజీ నువ్వు మరింత అందంగా — మరింత పరువంగా ఉన్నావు. ఇప్పుడు నీ వయస్సెంత రాజీ?"

రాజేశ్వరి నవ్వి "యిరవై ఎనిమిది" అంది.

"కొంచెం మందు వేసుకోనిమ్మి రాజీ. అలవాటయి పోయింది. అయినా ఎప్పుడూ మోతాదుగానే ఉంటాను." అంటూ కళ్ళు చిట్లించి ఆమెకేసి నవ్వుతూ చూసి బ్రాందీ గ్లాసులో పోసుకుని తాగాడు.

"మిలిటరీ దుస్తులలో ఉన్న నీ ఫోటో ఒకటి నాకివ్వు శంకరం" అందామె.

"ఒకటేమిటి నీకు కావల్సినవి తీసుకో." అని ఆల్బం ఆమె ముందు పడేశాడు.

ఆమె ఒక ఫోటో ఏరి తీసుకుని లేచి నుంచుని "ఇంక వెళ్ళొస్తాను శంకరం" అంది. అతను మాటాడలేదు. తదేకంగా ఆమెను చూస్తున్నాడు. ఆమె కొంచెం యిబ్బందిగా కదిలింది. "ఏవిటా చూడడం?" అంది విసుగ్గా.

శంకరం ఆమె దగ్గరకు వచ్చి రెండు చేతులూ చప్పున పట్టుకున్నాడు. "రాజీ. ఈ రాత్రికి యిక్కడఉండిపో ఒకసారి పూర్తిగా నువ్వు నాదానివి కావాలి. ఇంక జీవితంలో ఏమీ కోరను. ఇంక నీకు కనిపించను. ఈ ఒక్క కోరిక తీర్చు రాజీ ఈ తృప్తితో, యీ స్మృతితో యింక చనిపోయినా ఫరవాలేదు అనేం రాజీ అలా చూస్తావు. ఇది తప్పుగా భావిస్తున్నావా! నాకోసం, గుండెలో యింత పెద్ద ఎడారిని దాచుకొన్న నాకోసం — ఒక్కసారి, ఒక్కసారి..." ఉద్రేకంతో ఎరుపెక్కిన మొహంతో అతనింక మాట్లాడలేక పోయాడు.

## దంపతులకు ఎంతమంది పిల్లలు వుండాలి?



మనమందరమూ సుఖ సంతోషాలతో హాయిగా జీవితం గడపాలనీ, చిక్కులూ, సమస్యలూ ఉండకూడదనీ అనుకొంటాం ■ సుఖదాయకమైన కుటుంబంలో ఎంతమంది పిల్లలు వుండాలి? నేడు, చాలమంది దంపతులు తమకు ముగ్గురికంటే ఎక్కువ సంతానం అక్కర్లేదని అనుకొంటున్నారు.* తల్లిదండ్రులం అవడానికి ఎక్కువమంది పిల్లలు అవసరమని భావించుకొనే రోజులు గతించాయి! ■ కుటుంబాన్ని 'పరిమితం' చేసుకోవడానికి అనేక పద్ధతులు వాడుకలో వున్నాయి.

*ఆధారము: మైసూరు, ఉత్తరప్రదేశ్, బీహారు, బెంగాలులలో జనాభా సమస్యల పరిశీలన.

సలహా, ఉచిత సేవ



**కుటుంబ సంక్షేమ నియంత్రణ కేంద్రాన్ని దర్శించండి**

[illegible]

ఆమె మెల్లగా చేతులు విడిపించు కొంటూ "శంకరం నాకిష్టం లేదు" అంది నిశ్చయంగా.

అతనింకా ప్రాధేయ పడుతూ "రాజీ రాజీ ఒక్కసారి ... ..." అన్నాడు.

రాజేశ్వరి అతన్ని సోఫాలో కూర్చోపెట్టింది. మృదువుగా లాలనగా అంది "పిచ్చివాడవయి పోతున్నావు శంకరం. నువ్వడిగేది ఎంత అసహజమో ఎంత అసంభవమో నీకు తెలియడం లేదు. నువ్వు పెళ్ళి చేసుకోవాలి. తప్పదు శంకరం! నామాట విను"

శంకరం తల వాల్చుకుని కూర్చున్నాడు. అతని కన్నులలో నీరు చిమ్మింది.

రాజేశ్వరి "నేను వెళ్ళి వస్తాను శంకరం! నువ్వు స్థిమితంగా ఆలోచించుకో" అంటూ అతని జుట్టు నిమిరి గదిలోంచి వెళ్ళిపోయింది శంకరం మరికాస్త బ్రాందీ గ్లాసులో పోసుకొని ఒక గుక్కలో తాగి గిర్రున తిరిగే పంకా వైపు చూస్తూ కూర్చున్నాడు.

సిసిలియన్ డ్రెస్సులో ఉన్న హంగా పచ్చిన శంకరాన్ని సవ్వుతూ ఆహ్వానించింది రాజేశ్వరి ఆమె చాలా అందంగా అలంకరించుకుంది. ఇటూ అటూ అందంగా పెరిగిన గార్డెన్ చూస్తూ యీల వేస్తూ వచ్చాడు శంకరం ఆమె వొంటి మీద నుండి సుతారపు అత్తరు సువాసన అతన్ని సోకి గిలిగింత పెట్టింది. వరండాలో విద్యుద్దీపకాంతిలో నిలిచి ఉన్న ఆమె లావణ్యాన్ని అందాన్ని

---

* ఒక హిందీవాడు తెలుగుసినిమాకి వచ్చాడు. బోరు మహాజోరుగా ఉంది. వినుగ్గా మాటి మాటికి రిస్టువాచీవంక చూసుకుంటున్నాడు. పక్కనేకూర్చున్న పల్లెటూరిబాపతు "మాయదారిగడియారం. అంతల్లోకి ఓర్పు పట్టుకుపోతారయ్యా" అన్నాడు.

* ఒకాయన్ని పెళ్ళాం గట్టిగా కొట్టింది. "నిజంగా కొట్టావా, వేళాకోళమా ?" అనడిగాడు.

"నిజంగానే. ఏం చేస్తారు ?"

"అయితే ఫరవాలేదు. నా దగ్గిర వేళా కోళాలు పనికిరావు" అన్నాడు.

వింతగా వెర్రిగా చూస్తూ "రాజీ" అని చేతులు చాపాడు.

"హుంప్ - నౌకర్లింకా వెళ్ళలేదు" అందామె సిగ్గుగా.

ఇద్దరూ డ్రాయింగ్ రూమ్‌లో కూర్చున్నారు. రాజేశ్వరి మౌనంగా తలవాల్చి కూర్చుంది. శంకరం మెల్లగా "రాజీ. నువ్విలాగ అనుగ్రహిస్తావని అనుకోలేదు నీ చీటీ చూసి నప్పట్నుంచీ ఎప్పుడు చీకటి పడుతుందా అని చూస్తూ ఉన్నాను" అన్నాడు.

రాజేశ్వరి జవాబుగా నవ్వింది.

శంకరం నలువైపులా దృష్టి సారించి "చాలా పెద్దయిల్లే। ఈ ఫర్నిచర్ చాలా బాగుంది." అన్నాడు

ఆమెలో గృహిణీత్వపు గర్వం కళ్ళల్లో మెరిలింది, "బొంబాయిలో కొన్నాం. ఆయనా నేనూ కలిసి ఎన్నిక చేశాం" అంది.

"మీ గార్డెన్ కూడా మనోహరంగా వుంది రాజీ అంతా నీ కృషి ఫలితమే అనుకుంటాను" అన్నాడు శంకరం.

"ఒక్క నాకే కాదు. ఆయనకి గార్డెనింగంటే ప్రాణం. ఇద్దరం కలసి ఏ మొక్క ఎక్కడ నాటాలో, ఎక్కడ ఎలా వుండాలో వివరంగా ఆలోచించి ప్రణాళిక వేశాం. ఆయన గోతులు తవ్వడం; నేను మొక్కలు నాటడం. నేను బోదెలు చెయ్యడమూ ఆయన నీరుతోడటమూ-తోటమాలికి ఊరికే జీతం యిస్తున్నాం."

శంకరం సిగరెట్టు అంటించి గోడల మీద ఫొటోలు చూస్తున్నాడు. రాజేశ్వరి పక్కనే నిలబడి ఋతోంది.

ఇది మా పెళ్ళి నాటి ఫొటో ఇది హనీమూన్‌కి కాశ్మీరు వెళ్ళినప్పుడు. ఈ బొమ్మలన్నీ అవే! కాశ్మీరు ఎంతలవ్లీగా ఉంటుందని... ఇంకా ఆల్బమ్‌లో చాలా బొమ్మలున్నాయి. ఇది ఆయనకి జనరల్ మానేజరుగా ప్రమోషన్ వచ్చినప్పుడు తీసిన ఫొటో-నాకూ ఓ పూలదండ వేశారులే-"

శంకరం మరొక ఫొటోని చూసి "ఇది-ఈ ఎన్‌లార్జిమెంటు ఎవరిది?" అన్నాడు.

"మాబాబుది ఏడాది పిల్లవాడిది. ఎన్‌లార్జి చేయించాం"

శంకరం ఆశ్చర్యంగా "రాజీ, నీకు పిల్లలున్నారా" ? అన్నాడు.

"భలేవాడివి. పెళ్ళయాక పిల్లలు పుట్టరేఁ?" అంది రాజేశ్వరి.

"ఎంతమంది?"

"ఒక్కడే-"

"అందుకే యింకా నీ వొళ్ళు... ఆమె కేసి చూస్తూ ఆగిపోయాడు శంకరం. ఆమె ఫక్కున నవ్వి "సరే, యింక భోజనం చేద్దామా?" అంది.

"భోజనానికి తొందరేవిటి ఏదినీ ఇల్లంతా చూపించు రాజీ" అన్నాడు శంకరం కుతూహలంగా.

ఆమె ఒక్కొక్క గదీ చూపించింది, భర్త లైబ్రరీ గది, ఆమె గదీ, వంట గదీ అన్నీ చూపి అతన్ని మేడ మీదకు తీసుకు వెళ్ళింది. "ఈ బాల్కనీ అంటే వారికెంతో ఇష్టం అలసి పోయి వచ్చినప్పుడు ఇక్కడే కూర్చుని ఆకాశాన్నీ నక్షత్రాల్నీ చూస్తూ విశ్రాంతి తీసుకుంటారు. అప్పుడు నేను వీణమీద రెండు మూడు పాటలైనా వినిపించి తీరాలి" అంది రాజేశ్వరి.

సగం అల్లిన ఊలుస్వెట్టర్ని చూపించి శంకరం అన్నాడు "నీకు అల్లిక పని బాగా వచ్చునా రాజీ" అన్నాడు.

"ఏదో కొంచెం. కాలక్షేపం ఎలాగ



చెప్పు, ఆయనకి స్వెట్టర్లూ మఫ్లర్లూ అబ్బాయికి మేజోళ్లూ అల్లుతూంటాను."

"నీ భర్త ఎప్పుడు వస్తాడు రాజీ?"

"నాలుగైదు రోజుల్లో..." ఆమె ఆలోచనగా నిలబడిపోయింది.

"ఏమిటాలోచిస్తున్నావు?" అన్నాడు శంకరం.

"ఈ వేళ ఆయన దగ్గర్నుండి ఉత్తరం రావాలి. రాలేదేమా అని!"

"అందుకు పెద్ద కారణం ఏముంటుంది రాజీ. పని తొందరలో రాయక పోవచ్చును" అన్నాడు శంకరం.

"అదికాదు శంకరం. రోజు విడిచి రోజు వారు ఉత్తరం రాయకపోతె నాకు తోచదని వారికి తెలుసును" అంటూ సన్నగా నవ్వింది రాజేశ్వరి.

శంకరం మరోసిగరెట్టు వెలిగించాడు.

"ఈ రాధాకృష్ణుల దంతపుబొమ్మ ఎంత బాగుంది రాజీ. ఎక్కడ ఖరీదు చేశావు" అన్నాడు.

"నా పుట్టినరోజుకి ఆయన బహుమతిగా యిచ్చారు."

"ప్రతీ పుట్టిన రోజుకి మీ ఆయన ప్రెజెంట్ యిస్తాడా?"

"ఆ... ఏం మరచిపోయినా నా పుట్టినరోజూ, పెళ్ళిరోజూ ఆయన మరచిపోరు. ఇప్పుడు నేను కట్టిన చీర ఒక పుట్టినరోజు బహుమతే."

శంకరం కిటికీలోంచి వెన్నెలా పరచుకున్న పట్టణాన్ని చూస్తున్నాడు.

"ఏమిటి చూస్తున్నావు శంకరం?" అంది రాజేశ్వరి.

"ఇక్కణ్నుంచి వ్యూ బాగుంది" అన్నాడు శంకరం. అతని గొంతులో జీర వుంది.

రాజేశ్వరి శంకరాన్ని మరో గది లోకి తీసుకు వెళ్ళింది. గదిలో చిన్న టేబిలూ చిన్న చిన్నకుర్చీలూ చిన్న రైలుబండీ, మోటారు కారూ రకరకాల ఆటసామానులూ — ముచ్చటుగా వుంది. ఆరేళ్ళ కుర్రవాడు కాలు మీద కాలు వేసుకు పడుకున్నాడు. ఆయా మంచం వారనే కూర్చొని కథలు చెబుతోంది.

"వీడే మా అబ్బాయి. సుందరరావు. తాతగారిపేరు" అంది రాజేశ్వరి. సుందరరావు లేచి కూర్చుని "ఈయనెవరమ్మా. డాడీవచ్చారేమో అనుకున్నాను. డాడీ ఎప్పుడొస్తాడమ్మా" అన్నాడు ముద్దుగా

రాజేశ్వరి వాణ్ణి ముద్దుపెట్టుకొని "వచ్చేస్తారు బాబూ. ఇంకా పడుకోలేదేం — నిద్రరావడం లేదా" అంది.

"నువ్వు రావాలమ్మా. నువ్వొచ్చి కథ చెబితేకాని నిద్ర పోనమ్మా" అన్నాడు సుందరరావు బుంగమూతి పెట్టి.

"అలాగే సుందర్. బువ్వతినివచ్చి నీకు కథ చెపుతాను. ఏం?"

తల వూపాడు సుందరరావు.

"ఎవరి పోలిక రాజీ. మీ అబ్బాయిలో నీ పోలికలు కనిపించవేం" అన్నాడు శంకరం.

"ఆయన పోలికే – ఆ నుదురూ ఆ పెదాలూ ..." అంది రాజేశ్వరి గదిలోంచి వస్తూ.

రాజేశ్వరి శంకరాన్ని పడకగదిలోకి తీసుకు వెళ్ళింది. లేత నీలపు రంగు గోడలూ, రెండు పెద్ద స్టీల్ ఆల్మైరాలూ, తెరచి వున్న వాటిలోంచి కనపడే ఖరీదైన చీరలూ, పాంట్లూ, ముఖమల్ దుప్పటీ పరచిన మంచాలూ, మొజెయిక్ ఫ్లోరింగూ, గోడలలో అమర్చబడిన విద్యుద్దీపాల మెత్తని వెలుతురూ, నిలువుటద్దాలూ – లవెండరువాసనా. విశాలంగా ఉన్న ఆగది ఎంతో మనోహరంగా వుంది. దగ్గరగావున్న ఆ మంచాలమీద నారాయణరావూ రాజేశ్వరీ దగ్గరగా కౌగలించుకుని పడుకున్నట్టు కనపడ్డారు శంకరానికి. అతనికి గొంతులో డెక్కు పట్టినట్టయింది.

"ఎలావుంది శంకరం" అంది రాజేశ్వరి.

"వండ్రఫుల్" అన్నాడు శంకరం తేరుకొని. రాజేశ్వరి నవ్వింది ఆ నవ్వులో ఏదో తృప్తీ, గర్వమూ ధ్వనించాయి.

ఇరువురూ టేబిలుమీద ఎదురెదురుగా కూర్చుని భోజనం చేస్తున్నారు. శంకరం పరధ్యానంగా తింటున్నాడు.

"ఏం శంకరం. అదోలావున్నా" అంది రాజేశ్వరి.

"ఎలా వున్నాను" అన్నాడు నవ్వుతూ శంకరం.

---

* "బిచ్చం పెట్టండమ్మా ..." అని అరుస్తున్నాడు ముష్టికుర్రాడు. అందమైన అమ్మాయి తలుపులుతెరచి "వెళ్ళు వెళ్ళు ..." అన్నది. ముష్టివాడు అటూ ఇటూచూసి ;

"ప్రేమభిక్షేనా సరే ..." అన్నాడు నెమ్మదిగా.

* చాలాకాలానికి ఇద్దరు పెద్దమనుషులు కలుసుకున్నారు. ఒకాయన గలగలా నవ్వి : "అన్నట్టు మీ పెద్దాడు ఇప్పుడేం చేస్తున్నాడు ?" అని అడిగాడు.

"ఇప్పుడే భోంచేసి అలా రోడ్డుమీదకెళ్ళాడు ... ...

"గ్యామీగా."

"నిన్నూ నీ ఋంటినీ చూడడం ఒక అనుభవం సుమా. అవును కాని రాజీ ..." సందేహం ధ్వనించింది అతని గొంతులో.

"ఏం" కుతూహలంగా చూసింది రాజేశ్వరి.

"నన్ను పిలవడంలో నువ్వు తొందరపడి ..."

"నేను తొందరపడి నిర్ణయానికి రాననీ, వచ్చాక ఆ నిర్ణయం మారదనీ తెలుసుగా శంకరం"

శంకరం నవ్వేశాడు. ఆమె తన క్లబ్బుల గురించీ, అతను తన మిలిటరీ అనుభవాలూ చెప్పుకుంటూ భోజనం పూర్తి చేశారు. భోజనానంతరం రాజేశ్వరి శంకరాన్ని డ్రాయింగ్ రూమ్‌లో కూర్చోబెట్టి



యిన్ని పత్రికలు అతను ముందు వుంచి "వాటిని పడుకో బెట్టివస్తాను. నౌకర్లనీ పంపేవేస్తాను. ఈ పత్రికలు చూస్తూ వుండు. ఇంతవరకూ గృహిణి అయిన రాజేశ్వరిని చూసి విసుగెత్తింది కదూ." అని ఆగి సిగ్గుతో ఓరగా చూసి "ఈసారి నీ రాజేశ్వరిగా వస్తాను" అని వెళ్ళిపోయింది శంకరం మందహాసం చేశాడు.

ఒక గంట అనంతరం తెల్లని చీరతో సిగ్గూ కోరికా కలవరపడే కళ్ళతో అప్సరసలా మెట్లు దిగి వచ్చింది రాజేశ్వరి. కాని డ్రాయింగ్ రూంలో శంకరం లేడు. వరండాలోకి వెళ్ళి చూసింది. అక్కడా లేడు. గేటు కాపలావాడు తనవైపే రావడం చూసింది. "దొరగారు వెళ్ళిపోయారని చెప్పమన్నారు. ఈ కవరు మీ కిమ్మన్నారు" అని లేత నీలి రంగు కవరు ఆశ్చర్యంతో తెల్లబోయిన రాజేశ్వరికియిచ్చి వెళ్ళిపోయాడు. ఆ కవరు తనదే. డ్రాయింగ్ రూమ్ బల్లమీద తన కవర్లూ రైటింగ్ ప్యాడూ ఉన్నాయి.

సంభ్రమంతో ఆశ్చర్యంతో కోపంతో ఆత్రుతగా కవరువిప్పి యిలా చదివింది రాజేశ్వరి.

"రాజీ, నన్ను క్షమించు. నేను వెళ్ళిపోతున్నాను. నేను నిన్న కోరిన కోరిక ఎంత అసమంజసమో, అవివేకమో తెలుసుకున్నాను. నామీద జాలివల్ల నువ్వు అంగీకరించావు. అయినా నేను చూసి చూసి ఒక పవిత్ర దేవాలయాన్నీ, లోని దేవతనీ అపవిత్రం చేయలేను. పదేళ్ళక్రితం రాజేశ్వరివి కావు నువ్వు. నువ్వూ నీభర్తా నీకొడుకూ నీయిల్లూ-ఇవన్నీ పెనవేసుకు పోయిన స్త్రీ మూర్తివి నీ భువనువూ నీ భర్తకి అంకితమయింది. మీ యిద్దర్నీ విడదీసి చూడడం తెలివి తక్కువ. నిన్ను విడిగా ప్రత్యేకంగా నేను పొందడానికి నీ దగ్గర ఏమీ మిగలేది లేదు రాజీ. నిర్మలమైన ఒక సరస్సుని కెలికి వేసేటంతటి కుసంస్కారినికాదు నేను. దాంపత్య జీవితం ఇంతగా ఒక వ్యక్తిని మారుస్తుందనీ, ఉదాత్తం చేస్తుందనీ నేనెన్నడూ ఊహించలేదు. ఈచర్య జరిగివుంటే ఎంతో మానసిక సంక్షోభానికి కారణమై వుండేది. నిన్ను మరచి పోయేందుకు ప్రయత్నిస్తాను. నీ కోరిక ప్రకారం పెళ్లి చేసుకుని సతీమణితోనే నీకు మళ్ళీ కనిపిస్తాను — శంకరం."

***



# కిశోర ప్రాయం

విజయలక్ష్మి రామకృష్ణన్
(ఉన్నవ విజయలక్ష్మి)

జనవరి ఒకటో తేది ఆ సాయంత్రమంతా వాళ్ళ మామయ్యకు వచ్చిన గ్రీటింగు కార్డులు చూడ్డంతోటే సరిపోయింది అనంతలక్ష్మికి పెందలాడే భోంచేసి చదువుకోడానికి కూర్చుంది తన గదిలో పరీక్షలింకా మూణ్ణెల్లు లేవు న్యూ ఇయర్ అటు యిటు కాకుండా చలికాలం మధ్యలో రావడం సంవత్సరాది పండగ మార్చిలోనో ఎప్రియల్లోనో పరీక్షల మధ్య రావడం అసహజంగా అనిపిస్తాయి అనంతకు జులై ఫస్టుకు కాలేజీలన్నీ తెరిచి ఆ రోజునుంచి సంవత్సరం మొదలెడితే అప్పుడు నిజంగా న్యూ ఇయర్ ఫీలింగు వస్తుంది అనుకుందామె

ఆఏడాది మరీచలి రజాయి కప్పుకుని వెచ్చగా పడుకుని నవలలో నాటకాలో చదువుకోడానికి లేకుండా ప్రాణాలు తియ్యడానికి ఈ పరీక్ష లొకటి! చదువు మనసుకు పట్టకుండా వుంది అనంతకు అవులిస్తూ గదిబైటకు వచ్చింది నారాయణరావు గదిలోంచి గురకచప్పుడు వినవస్తోంది అనంత నవ్వుకుంటూ మామయ్య నిద్ర పోయారంటే చుట్టుప్రక్కల ఎవరికీ నిద్ర పట్టదు అనుకుంది వాసుదేవరావు గదిలో

దీపం వుంది అతని కీసంవత్సరం ఫైనలియరే! చదువుతున్నాడేమో

అనంత వాసు గదిలోకి వెళ్ళింది వాసు ఏదో వ్రాసుకుంటున్న వాడల్లా అనంత రావడం చూసి కలం మూసి ఏం చదువు సాగటల్లేదా? కూర్చో అన్నాడు ఉహూ ఉం నిద్రొస్తోంది నీ ఫ్లాస్కులో టీ వుందా అన్నది ఉంది ఇంకో కప్పు పట్టుకురా త్రాగుదాం అన్నాడు నేను వెళ్ళలేను బాబూ ఫ్లాస్కు మూతలో త్రాగుతా లే నేను అన్నది

వాసు ఫ్లాస్కులో టీ రెండిటిలో పోసి కప్పు అనంతకిచ్చి ఫ్లాస్కు మూతలో తను త్రాగాడు వేడి వేడి టీ తీసుకోగానే కాస్త మత్తు వదిలింది కోర్సు అంతా ఒక్కసారి చదివావా? క్లాసువస్తుందా అనడిగాడు వాసు

ఎక్కువ చదవలేదు కాని విన్నది చదివింది గుర్తుంది కనుక పరవాలేదు ఒకనిజం చెప్పనా బావా నీకు? క్లాసు రాదేమోనన్న భయం ఎంత వున్నదో ఎక్కడ వస్తుందో అన్న భయంకూడా అంత వుంది అంది అనంత

క్లాసు వస్తే భయమేమిటి నీ మొహం




ఔను క్లాసు రాగానే సంతోషం కాదు ఆపైన మెడిసిన్ సీటు రాకపోతే నాపనిఖూనీ!

ఏం? మెడిసిన్ చదవడమంటే యిష్టం లేదా నీకు? అనడిగాడు వాసు

అయ్యో నాకు చచ్చే భయమున్నూ అసహ్యమున్నూ మహా తెలివిగలవాళ్ళు మానవసేవ చెయ్యాలనుకునే ఉన్నతులు డాక్టరు కోర్సుకు వెళ్ళాలి కాని నావల్లకాదు బాబూ అంది అనంత క్లాసు తెచ్చుకో ఆపైన డాక్టరు కోర్సు చదవనని చెప్పు నాన్నతో!

బాగుంది మామయ్య అంత తేలిగ్గా విడిచి పెడ్తారా నిన్ను చదవమంటే నువ్వు చదవలేదుట ఆశలన్నీ నామీద పెట్టుకున్నారు నేను వద్దంటే మామయ్య మంచమెక్కుతారు అంది అనంత

నీ తలకాయ! చదివి క్లాసు తెచ్చుకో ఆ తర్వాత నాన్నకు నీ కేది చదవడం యిష్టమో నేను చెప్తాను అయినా ఎన్నాళ్ళీ పసితనం నీకు? ఎందుకింత భయం? అన్నాడు వాసు

నాకేమి భయం? సరే నే వెళ్తా నీచదువు కూడా చెడగొట్టడం దేనికి అని అనంత లేచి తన గదిలోకి వెళ్ళి పుస్తకాలు మూసేసి దీపమార్పి పడుకుంది

అనంతలక్ష్మి ఆ యింటికి వచ్చి



పదమూడేళ్ళయింది. అనంత తండ్రి రాఘవరావు, వాసు తండ్రి నారాయణరావు చిన్నప్పుడు బందరులో కలిసి చదివారు. ఆ తర్వాత నారాయణరావు లెక్కల్లో బి. యే. ఆ తర్వాత బి. యల్. పూర్తి చేశాడు మద్రాసులో. ఆ నాలుగేళ్ళలో రాఘవరావు బి. యే. పూర్తి చేశాడు. రాఘవరావు వాళ్ళ స్వంతఊరు నూజెళ్ళలో వ్యవసాయం చూసుకుంటూ వుండిపోయాడు. ఇద్దరూ గృహస్థు

లయ్యారు. నారాయణరావుకు ప్రాక్టీసుమీద శ్రద్ధ కుదరలేదు. రాఘవరావుదగ్గర అప్పు తెచ్చి పెట్టుబడిపెట్టి మందులషాపు తెరిచాడు కాలం కలసి వచ్చింది నారాయణరావుకు బాగా డబ్బు గడించాడు జీవితంలో సెక్యూరిటీ లాంటిది ఏర్పడిం దనుకున్న తర్వాత అతని సంపాదనా కాంక్ష మందగించింది

తర్వాత ఆరేళ్ళకు రాఘవరావు భార్యకు ప్రాణంమీదకువచ్చిందన్న కబురువిని నారాయణరావు, భార్య జానకిని తీసుకుని ఆ పల్లెటూరువెళ్ళాడు రాఘవరావు భార్య కాన్పులో చచ్చిపోయింది. బిడ్డ భూమ్మీద పడకుండానే పోయింది. అది ఆమెకు మూడవకాన్పు.

స్నేహితుణ్ణి ఎట్లా ఓదార్చాలో తెలియలేదు నారాయణరావుకు. నారాయణరావు ఆరేళ్ళ కొడుకు వాసు, రాఘవరావు పెద్దకూతురు వసంతలక్ష్మి కళ్ళుతుడిచి "ఏడవ్వద్దు. నువ్వేడిస్తే నాకు ఏడుపువస్తుంది. మా వూరొస్తావా నాతో" అన్నాడు.

నారాయణరావు మనసులోనే నిశ్శబ్దంగా దుఃఖించాడు. స్నేహితుని కూతుళ్ళిద్దరిని భార్యకు చూపించాడు. ఏదో అర్థమైనట్లుగా ఆమె రాఘవరావు దగ్గరకు వెళ్ళి "అన్నగారూ! అమ్మాయిలిద్దరిని నేను తీసికెళ్ళి వుంచుకుంటాను కాస్త తేరుకున్నాక మీరుకూడా కొన్నాళ్ళువచ్చి బందరులోవుండండి" అన్నది. రాఘవరావు "వద్దు, వీళ్ళుకూడా దగ్గర లేకపోతే నేనేమవుతానమ్మా" అన్నాడు. పెద్దపిల్ల వసంతలక్ష్మిని తండ్రి దగ్గరే విడిచి, చిన్నపిల్ల అనంతలక్ష్మిని వెంటపెట్టుకు వచ్చారు జానకీ, నారాయణరావు. రెండేళ్ళ పిల్ల అనంత, కాళ్ళు రెండు కర్పాణితో పొంగివున్నాయి జానకి తన బిడ్డగా పెంచింది అనంతను నారాయణరావుకు పెళ్ళికాక ముందునుంచి ఒక విచిత్రమైన కోరిక వుండేది. ఒక అందమైన, తెలివైన అమ్మాయికి తండ్రికావాలని! అనంత ఆ యింట్లో పెరుగుతుంటే తనకు కూతురు లేదని తోచలేదు ఎప్పుడూ అనంతకు నారాయణరావు మాట వేదవాక్కు. అనంత అక్క వసంత మద్రాసు స్టెల్లా మేరీస్‌లో బి. యే. చదువుతున్నది. సెలవల్లో ఎప్పుడేనా వసంత బందరు రావడమేగాని, నారాయణరావు అనంతను నాలుగు రోజులకూ్కడా ఎక్కడికీ పంపడు.

పరీక్ష లయిపోయాయి. ఖర్మ కాలి క్లాసు రాదుకదా అనుకుంది, అన్ని పేపర్లు బాగానే వ్రాశా నను కున్న అనంత, ఆ మధ్యాహ్నం భోజనా లయింతర్వాత అందరు హాల్లో కూర్చున్నారు వాసుమాత్రం తన గదిలోకి వెళ్ళిపోయాడు. అతడు తండ్రికి ఎదురుగా ఎక్కువ నిలవడు. తండ్రి కొడుకుల మధ్య యోజనాల దూరం.

"ఈ సెలవుల్లో వసంత రాదట, స్నేహితులతో కలసి కేరళా అదీ వెడుతున్నదట. అనంతను గుంటూరు పంపిద్దాం, ఓ పదిరోజు లుండి వస్తుంది. మోహిని టైఫాయిడ్ పడి లేచింది. దానికి బాగుంటుంది యిది వెళ్తే" అంది జానకి భర్తతో.

"గుంటూరా ? పోయి పోయి వేసవికాలం గుంటూరుకు బుద్ధి వున్నవా డెవడూ వెళ్ళడు" అన్నాడు నారాయణరావు.

"మరేం ఫర్వాలేదు, గుంటూరులో వాళ్ళు మనుష్యులు కారా ఏం ? మీ మేనగోడలు ఏమీ అయిపోదు" అంది జానకి.

"మామయ్యా, వెళ్తాను మామయ్యా. పోనీ ఒక వారంవుండి వచ్చేస్తాగా" అంది అనంత. జగన్మోహిని జానకి అన్న కూతురు. ఆ క్రిందటేడు దీపావళికి మేనత్త పిలువనంపగా ఒకటరు వచ్చి ఒక వారం గడిపింది. ఆ వారం రోజుల్లో మోహినికీ, అనంతకు బాగా స్నేహం కుదిరింది. నారాయణరావు చిరాగ్గా "ఈ సెలవలు రెండు నెలలు వృధాపోవడ మెందుకని మీ కాలేజీ లెక్చరర్ శేషాచలంగారిని రోజూ మనింటికి రమ్మన్నాను. నీకు షేక్స్పియర్ చెప్పడానికి. వచ్చే ఏడు మెడిసిన్‌కు వెళ్తే, తర్వాత ఎప్పుడు చదువుతావు యిటువంటివన్నీ ? పరీక్షల వంకతో వీణ మూలపెట్టి నెలయింది. సంగీతం మేష్టారికి కబురు చేశారా ? సెలవలొస్తే ఏదేనా చదువుకుందాం, నేర్చుకుందాం అని వుండాలా ? గుంటూరు వెళ్ళాలి, గోంగూర కొయ్యాలి అని మోత; మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి" అన్నాడు.

జానక్కి కోపంవచ్చి మాట్లాడకుండా యింట్లోకి వెళ్ళిపోయింది. అనంత ముఖం చిన్న బుచ్చుకు కూర్చుంది.

"అట్లా కూర్చోకపోతే, ఆవీణ కాస్త దులిపి పట్టుకురా, శ్రుతి చేసిస్తాను. వాయించు కాసేపు" అన్నాడు నారాయణరావు.

అనంత లేచి వెళ్ళింది. శ్రుతి చేసిన వీణ తీసుకుని, మామయ్యమీద కోపం అంతా తీగలమీద చూపెడుతూ భైరవిలో వర్ణం వాయించి తర్వాత 'ఇంకేం వాయించను, చెప్పండి" అన్నది.

"ఆఁ క్రొత్తగా చెప్పిన రాగం, అదేమిటది ? బాగుందన్నాను"

"నాగ గాంధారి" అని బదులు చెప్పి ఒక కీర్తన వాయించింది అనంత.

"మీ మాష్టరు గారు బాగా చెప్తారు. నీ చేతిలో ఒడుపు వున్నదానివి. సాధన వుంటే చక్కగా రాణిస్తావు. శ్రద్ధ లేదయ్యే. ఇహ చాల్లే వెళ్ళు" అన్నాడు అనంతను ఒక రకంగా మెచ్చుకుంటూనే మందలిస్తూ.

జూన్ మొదటి వారంలో అందరి రిజల్ట్సు వచ్చాయి. వాసుకు ఎకనమిక్స్‌లో క్లాసు వచ్చింది. అనంత సాధారణంగా ప్యాసయింది.

"పోనీలేమ్మా క్లాసు రాలేదని ఏడవకు. దిష్టి తగిలిందే నీ చదువుకు! లేకపోతే నీకు క్లాసు రాకపోవట మేమిటి?" అన్నాడు నారాయణ రావు అనంతతో. క్లాసు రానందుకు ఒకే దిగులుపడ్డాడాయన. లాంఛనంగా మెడిసిన్‌కు అప్లైచేయించారు. ఇంటర్వ్యూకు వెళ్ళింది. సీటురాలేదు. జులైలో బందరు కాలేజీలో నే బి. యస్సీలో చేరి చదవసాగింది. వాసు యం. ఏ. కు బెనారస్ వెళ్ళాడు ఎంత దూరంవెళ్తే అంత మంచిదని.

వాసు వెళ్ళాక అనంతకు యింట్లో ఒంటరితనం ఎక్కువైంది. దాంతో అదివరకులేని అలవాటు ఒకటి పట్టుకున్నదామెను. కనబడిన ప్రతి పుస్తకం చదివెయ్యడం! నారాయణరావు చూస్తుండగా ఇంగ్లీషు పుస్తకాలు, ఆయన చూడకుండా తెలుగుపుస్తకాలు లెక్కలేకుండా చదివింది. చదివిన అన్నికథల్లోను ఆమెకు, ప్రపంచంలో ప్రేమకోసం స్త్రీలు, పురుషులు తమ సర్వస్వాన్ని ఎట్లా అర్పిస్తారో, ప్రేమించడం అనే అనుభవం కోసం ఎంత తహతహలాడిపోతారో కొట్టొచ్చినట్లు కనబడింది. వయసు మాహాత్మ్యాన పుస్తకాల్లోని యితర మహత్తర విషయాలేవీ మనసుకు అంతగా పట్టలేదు.

వేగంగా ప్రవహించే నదిలాంటిది ప్రేమ. ఈదడం తెలీని వాళ్ళుకూడా ప్రాణాలమీద ఆలోచన లేకుండా ప్రవాహంలో దూకుతారు. కొందరు మునిగిపోతారు. కొందరు ఎదురీది అవతలి గట్టు చేరుకుంటారు. మరి కొందరు అదృష్టవంతులకు తల మున్కలైన సమయంలో, ఎవరో తారసిల్లి భుజాలమీద వేసుకుని ఒడ్డుకు చేరుస్తారు. "ఏమిటీ ప్రేమ? అదొక సరదానా, వ్యామోహమా, భ్రమా, అవసరమా?" అనంత ఆలోచిస్తూ వుండిపోయింది. "ఖర్మకాలి లక్ష్మణుడికి భార్య అయిన ఊర్మిళ, జీవితమంతా అనురాగానికి వాచి అల్లాడిన ఏకవీర, జీవితమంతా ప్రియుని గూర్చిన ఆరాటంలోనే గడిపిన పార్వతి — ఎటువంటి స్త్రీలు వాళ్ళు! వాళ్ళను తలచుకుంటేనే గుండెలు పిండినట్లవుతుంది. వీళ్ళందరిది వట్టి వ్యామోహమేనా?" ఛస్తే కాదనుకుంది. పుస్తకాల్లో స్త్రీలంతా ఆమె కళ్ళముందు మెదిలారు. పెద్ద పెట్టున ఏడుపు వచ్చింది అనంతకు. దిండులో తల పెట్టుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. "ప్రేమించడం అంత బాగుంటుంది కాబోలు, ప్రేమ పొందడం అంత కష్టం కాబోలు! నా కక్కడ దొరుకుతుందా జీవితంలో అంత ప్రేమ" అనుకుంది. ఒక రచయిత అంటాడు "స్త్రీలు

ఏ వ్యక్తిని ప్రేమించరు, ప్రేమించడం అనే అనుభవాన్ని ప్రేమిస్తారు" అని. క్రొత్త రూపాయినోటు లాంటి మాట అది. అలిసిపోయి నిద్రించింది అనంత.

ఆ రోజు ఆదివారం. ఇంట్లో వుండి విసుగ్గా వుంది అనంతకు. వాసు వున్నప్పుడు నెలకు మూడు ఆదివారాలన్నా సినిమా ప్రోగ్రాము వుండేది. వాసు వెళ్ళాక రెండు సార్లు మాత్రం సినిమాకు వెళ్ళింది అనంత. క్లాసు మేట్సుతో కలిసి వెళ్ళాలంటే నారాయణరావు పంపించడు. స్నేహితుల యిళ్ళకు వెళ్ళడానికి వీలులేదు. "మీ అత్తయ్యను తీసుకుని ఏదైనా సినిమాకు వెళ్ళు" అంటా డాయన. ఆమె నడిగితే "నాకు తలనొప్పి సినిమాలంటే. మీ మామయ్యనే అడుగు" అంటుంది. వీళ్ళిద్దరిని బ్రతిమాలేసరికి వెళ్ళాలన్న సరదా కాస్త చచ్చిపోతుంది. ఇంకో వారానికి మళ్ళీ కాలేజి మూస్తారు దసరా సెలవలకు.

వసంత ఈ సంవత్సరం ఫైనలియరు కనుక "సెలవల్లో యింటికిరాను, యిక్కడే వుండి చదువుకుంటా"నని వ్రాసింది. వాసు "సెలవల్లో డెహరాడూన్, ముసోరి వెళ్ళి చూస్తాను. దారిలో లక్నో, హరిద్వార్ కూడా చూస్తాను. నాన్నకు చెప్పు, మూడు వందలు పంపమని" అని తల్లికి వుత్తరం వ్రాశాడు. అనంతకు వ్రాస్తూ "ఈ యూనివర్సిటీ ఎంతో నచ్చింది నాకు. నీవు కూడా యం. ఎస్సి. ఇక్కడే చదువుదువుగాని, త్వరగా పూర్తి చెయ్యి బి. ఎస్సి" అని వ్రాశాడు. "తోచక చచ్చిపోతున్నాను యిక్కడ. తర్వాత చేసుకుందువుగానిలే యాత్రలు, ఈ సెలవల్లో యింటికి వచ్చి వెళ్ళు" అని వ్రాయా లనుకుంది అనంత. కాని వ్రాయబుద్ధి కాలేదు మళ్లీ. వచ్చాక "ఎక్కడికీ వెళ్ళకుండా నిన్ను ఉద్ధరించడానికి వచ్చానన్న" ముఖం పెడ్తాడో ఏమో? ఎందుకొచ్చిన బరువు? ఎవరి సుఖానికి, ఎవరి ఆశకు అడ్డు నిలవకూడదు తను. అది ఎంత చిన్న సుఖమైనా సరే" అనుకుంది అనంత. తనకోసం ఎంతటి త్యాగమైనా చెయ్యగల దగ్గర వాళ్ళను కూడా మైలు దూరంలో వూహించుకునే మనస్తత్వం అనంతది.

దేవుడిచ్చిన వరంలాగా ఆ రోజే

---

* ఒక పెద్దమనిషి సిటీ వెళ్ళాడు. బజార్లో తిరుగుతూ ఆగి "ఇక్కడ మంచి జోళ్ళు దొరకవా?" అని అడిగాడు ఒక చిన్నమనిషిని.
"ఎబ్బే, డబ్బెట్టి కొనుక్కోవలసిందే" అన్నాడు చిన్నమనిషి.

**అనంతకు గుంటూరునుంచి జగన్మోహిని జాబు వచ్చింది.**

**'అనూ,**

**అక్కడంతా** కులాసా అనుకుం**టాను. ఉన్నట్లుండి** అమ్మ, నాన్నా **తిరుపతి** ప్రయాణం పెట్టుకున్నారు. **కారులో** వెళ్ళిరావడం అలసటవు**తుందని నన్ను** రావద్దన్నారు. పది **రోజుల పాటు** అత్తయ్యదగ్గరకెళ్ళి **వుండమన్నారు.** మరి ఇంత పెద్దఇంట్లో **ఒంటరిగా** ఎట్లావుండను? అన్నయ్య **రాత్రిళ్ళు** హాలునుంచి సెకండ్ షో సగమయ్యాక గాని రాడు. అమ్మ అత్తయ్యకు ఉత్తరం వ్రాయమంది. నాకేమో, అనంతా, నీకువ్రాయాలనిపించింది. రేపు సాయంత్రానికి వస్తాను. అన్నయ్యవచ్చి దిగపెడతాడు. అత్తయ్యకుచెప్పు. మామయ్యకు నమస్కారములు. నేను గీసిన బొమ్మలు చూడాలన్నావు కదూ, పట్టుకువస్తాను. చూచి నవ్వవు గదా! నీతో వారంరోజులు గడుపుతాను అనుకుంటేనే నాకు ఎంతో

బాగుంది అనంతా! నమ్ముతావా నా మాట!

ప్రేమతో
మోహిని."

అనంతకు ఉక్కిరి బిక్కిరయింది సంతోషంతో. "అత్తయ్యా మోహిని వస్తుందట రేపు సాయంత్రం" అని అరచుకుంటూ పరిగెత్తింది. ఉత్తరం చదివిన జానకి అనంతను ప్రేమగా చూస్తూ "ఎందుకే అనంతా, నీకు మోహినిఅంటే అంతఇష్టం" అన్నది.

"మోహిని-ఎంతో బాగుంటుంది కదు—అత్తయ్యా" అంది అనంత. జానకి తెల్లబోయింది. అనంత సర్దుకుని "కాదత్తయ్యా మోహిని అంటే నీ కూడా యిష్టమేగా, అట్లాగే!" అంటూ వెళ్ళిపోయింది తన గదిలోకి. మోహిని వ్రాసిన ఉత్తరం, అనవసరమైన అపేక్షలు కురిపించని ఉత్తరం - మళ్ళీ మళ్ళీ చదువుకుంది అనంత.

వాసు రాని లోటును, వసంతరాని లోటును మరిపించిందామెను మోహిని వస్తున్న కబురు. నౌకర్ను పిలిచి తన గదంతా దులిపించి కడిగించింది. పుస్తకాలన్నీ ఓపిగ్గా సర్దింది. స్టాండుమీది చీరలు తీసి తుడిచి లోపల పెట్టింది. మోహినికోసం యింకొక మంచం తన గదిలోనే వేయించింది. పక్క వేయిస్తుంటే జానకి "వాసు గదిలో కూడా మంచంమీద పక్కవేయించు అనంతా, కృష్ణుడు వస్తాడుగా మోహిన్ని దింపడానికి. ఉండిపోతాడేమో రాత్రికి" అన్నది. అనంత వాసు గది కూడా దులిపించి పక్క వేయించింది. వాసు గదిలో డ్రాయర్లు, అల్మారాలు అన్ని తాళం వేసుకు వెళ్ళాడు. "బావ గట్టివాడు, ఏం దాచుకున్నాడో అంత రహస్యాలు" అనుకుంది అనంత.

సాయంత్రం మోహినిని వెంట పెట్టుకు వచ్చింది. సంపెంగ పరిమళాలు వెద జల్లుకుంటూ వచ్చింది జగన్మోహిని. "అందానికి తావి, నాకు సంపెంగలు" అంటూ మోహిని చెయ్యి పుచ్చుకుంది అనంత. మోహిని "ఫో, అట్లా అనకు, సింహాచలం నుంచి నాన్నగారికి తెలిసిన వాళ్ళెవరో వచ్చారు మధ్యాహ్నం. వాళ్ళు తెచ్చారు సంపెంగలు. నీ కూడాకాసిని తెచ్చాను" అన్నది మోహిని. వచ్చిన పావుగంటకే "నే వెళ్తాను మామయ్యా" అంటూ లేచాడు మోహిని అన్న కృష్ణమోహన్. "రాత్రికివుండు, తెల్లవారి వెడుదువుగాని" అన్నాడు నారాయణరావు.

"కానురా, ఏమి తొందర, ఎప్పుడూ రానేరావు" అంది జానకి మేనల్లుడితో. "కాదత్తయ్యా యీ వాళ హాలు దగ్గర ఎవరూలేరు. వెళ్ళాలి. పనిచెడుపుకుని పాపాయిని దింపడానికి వచ్చాను" అన్నాడు. కాఫీ త్రాగుతూ "పాపాయిని అట్టే మేపకండి అత్తయ్యా, మళ్ళీ రూపం మొదటికి వస్తుంది. ఈ మధ్యనై

ఫాయిడ్ పుణ్యమా అని కాస్త చూడ చక్కగా వుంది మళ్ళీ నువ్వు చెడ గొట్టకు" అన్నాడు కృష్ణ మోహిని సిగ్గుపడింది కృష్ణమోహన్ వెళ్ళి పోయాడు

ఆ రాత్రి మంచాలు దగ్గరగా జరుపుకుని కబుర్లలోపడ్డారు అనంత, మోహిని "మోహినీ,ఒకపాటుపాడు" అనడిగింది అనంత "రేపు పాడ తాను నువ్వు వద్దనేవరకు పాడ తాగా, ఒట్టు!" అంది మోహిని. "నువ్వు ఎన్ని పాటలు పాడితే మాత్రం నేను వద్దంటానా మోహినీ.మరీహిందీ పాటలు ఎంత మధురంగా పాడతావు నువ్వు! వెళ్ళేలోగా నీకు వచ్చిన మీరా గీతాలన్నీ నాకు నేర్పాలి" అన్నది అనంత మర్నాడు కాలేజికి వెళ్ళనంది అనంత "ఫరవాలేదు నేనేదైనా చదువుకుంటాను నువ్వెళ్ళిరా కాలేజికి" అని బలవంతం చేసింది మోహిని కెమిస్ట్రీ ప్రాక్టికల్ క్లాసు అయ్యాక, ఇంగ్లీషు క్లాసు ఎగ్గొట్టి యింటికి వచ్చింది అనంత.

"క్లాసుమానేసి ఎందుకువచ్చావు" అన్నది మోహిని "నువ్వు వెళ్ళమంటే వెళ్ళి ప్రాక్టికల్ చేసి వచ్చాను నేను ఒక పీరియడ్ మానేసి, ఓ గంట ముందు యింటికి వస్తే నువ్వు తప్పు పట్టకూడదు, కాంప్రమైజ్" అన్నది అనంత సాయంత్రం సినిమాకు వెళ్దామను కున్నారు. నారాయణరావు "కారు రేపు వస్తుంది వర్క్‌షాపు నుంచి, రేపు వెళ్ళండి", అనడంతో ఆగి పోయారు. ఆ రాత్రి భోజనాల దగ్గర "ఏమిటి మన కారుకు నెలకో సారి రిపేరు ? అమ్మేసి కొత్తది కొను మామయ్యా. కాలేజిలో అంతా నవ్వడమే. డొక్కు కారు అంటారు నన్ను చూసి" అన్నది అనంత.

"బాగుందే డొక్కే మిక్కే, నీ కంటే రెండేళ్ళే పెద్ద మనకారు" అన్నాడు నారాయణరావు. మోహిని చిన్నగా నవ్వింది.

"చూడండి మా అమ్మాయి నవ్వు తోంది మీ మాటలకు" అన్నది జానకి మేనగోడలును మురిపెంగా చూస్తూ.

రాత్రి మాటల్లో అడిగింది మోహిని "అనంతా! ఈ సెలవలకు మీ అక్క, బాను బావ ఎవరూ రాలేదా? వాళ్ళు వచ్చి వుంటా రనుకున్నాను."

"ఏం బావ లేకపోతేనీకు బాగా లేదాయిక్కడ?" అనినవ్వింది అనంత.

"ఫో, నన్ను ఏడిపించకు" అంది మోహిని.

"నేనేం నవ్వుతాలకు అనడం లేదు బావ వెళ్ళిం దగ్గరనుంచి నాకేమి తోచడంలేదు" అన్నది అనంత మోహిని తన పెద్ద కళ్ళను మరీ పెద్దవిగా చేసి బెరుకు బెరుకుగా చూసింది అనంత వంక. బిగ్గరగా నవ్వేసి "మోహినీ



బావంటే నీ కెంత యిష్టం అన్నది అనంత మోహిని ఫో – నీ కిష్టం లేదా ఏం?" అన్నది నువ్వు ఒట్టి ప్రబంధ నాయికవు మోహినీ మీ అమ్మ నీకు పేరు సరిగ్గా పెట్టారు" అన్నది అనంత మోహిని కళ్ళలో నీళ్ళు నిండాయి తప్పించుకోవాలని చూసింది కాని అనంత కళ్ళబడింది మోహినీ, ఏడుస్తున్నావా, నేనేమైనాతప్పుగా మాట్లాడానా? చెప్పవూ?ఎందుకేడుస్తావు?" అనడిగింది అనంత "లేదు అనంతా నువ్వేమి అనలేదు నిజం నువ్వేం అనలేదు ఎందుకో ఏడుపు వస్తోంది నాకు" అన్నది మోహిని

అనంత మోహినికి దగ్గరగా జరిగి ఆమె ముఖం పైకెత్తి "మోహినీ, ఏడవద్దు నాకు తెలుసు నీ రహస్యం క్రింద కేడు నువ్వువచ్చి వున్నావిక్కడ అప్పుడే అనుకున్నాను బావ పైన ఆశ పెట్టుకున్నావు గదా! ఎందుకు భయపడతావు? ఏ జన్మలోనో తపస్సుచేసుకుని వుండాలి బావ, నీ ప్రేమను పొందడానికి" అన్నది అనంత మోహిని కళ్ళు

దించుకుని "అనంతా, నీకు కోపం లేదూ నామీద" అన్నది మోహిని.

అనంతకుఎవరో ఛెళ్ళునకొట్టినట్లయింది. మోహిని ముఖాన్ని రెండు చేతుల్లోనూపట్టుకుని "పిచ్చి మోహినీ, అదా నీ భయం? అందుకా ఏడుస్తావు? నాకెందుకు కోపం నీమీద? అత్తయ్యా మామయ్యా పెంచారు నన్ను! వాసు నేను తోడబుట్టిన వాళ్ళలాగ పెరిగాము. ఈ యింటికి ఆడబడుచును నేను. మా యింటికి ఓ దేవతలాంటి అమ్మాయి వస్తుందని, మా యింట్లో సౌందర్యాన్ని, సంతోషాన్ని కురిపిస్తుందని వూహిస్తేనే ఎంతో మధురంగావుంది నాకు. మోహినీ, నిజంగా వాసు




పిలుపుకే బావ నాకు. అన్నయ్యలున్న అమ్మాయిలనుచూసి నేను ఎప్పుడూ అసూయపడలేదు" అన్నది. మోహిని అనంత ఒళ్లో తల పెట్టుకుంటూ "అనంతా నన్ను దేవత అనద్దు. నువ్వునాకుదేవతవు" అన్నది. కబుర్లలో ఎప్పుడు నిద్ర పట్టిందో తెలియదుగాని తెల్లవారి ఎనిమిదింటిగ్గాని లేవలేదు వాళ్లిద్దరు.

ఆ మధ్యాహ్నం మాటల్లో పుస్తకాల ప్రసక్తి వచ్చింది. శరత్ నవలలు చదువుతావా మోహినీ, నీకిష్టమేనా" అనడిగింది అనంత.

"శరత్ నవలలు యిష్టపడనివాళ్ళు కూడా వుంటారా అసలు? నేను ఒకటి కూడా బాకీ లేకుండా తెలుగులో వచ్చినవన్నీ కొన్నాను, చదివాను. అయితే ఒకటి అనూ, ఈ నవలలన్ని నాకు ఫలహారాలు తిన్నట్లు వుంటుంది కాని భోంచేసినట్లుండదు" నింది మోహిని.

"మరయితే నీ కేమి యిష్టం బాగా."

"నాకు జీవిత చరిత్రలు, చరిత్రాత్మక నవలలు చదివితేనే తృప్తి, కడుపు నిండిన ట్లుంటుంది. మనసు పొంగిపోతుంది. ఆ హాయి నాకు సాంఘిక నవలలు, సాంసారిక కథలు చదివితే రాదు."

"నీకు హిందీ, తమిళం కూడా వచ్చుకదూ! తమిళంలో మంచి చరిత్రాత్మక నవల లున్నవటగా"

"ఔను, అమ్మ తమిళమే చదివారటు. నాకు నేర్పారు. మా మేనమామ కూతుళ్ళు ఇందిరా, రమా తమిళంలోనే వ్రాస్తారు జాబులు. హిందీ అంటే నాన్నగారికి యిష్టం. ట్యూషన్ పెట్టి చెప్పించారు. విశారద ప్యాసయ్యాను. తమిళంలో కల్కి వ్రాసిన హిస్టారికల్స్ ఎంత బాగుంటాయి? "పొన్నియన్ సెల్వన్" "శివకామి శపథం" ఎంత బాగుంటాయి? తెలుగులో కూడా మంచి చరిత్రాత్మక నవల లున్నాయి కదా! ధర్మచక్రం, నారాయణభట్టు, రఘునాథ విలాసం, గోన గన్నారెడ్డి, హిమబిందు, సప్తపర్ణి చదివాను నేను. అన్నీ చక్కని నవలలే! అన్నది పరవశంగా మోహిని. "తెలుగులో, తమిళంలో, హిందీలో ఎన్నో పుస్తకాలు చదివావు, మాట్లాడితే నేను చదువుకోలేదుగా అంటావేం మోహినీ?"

"నా మొహం, నేనేం చదివాను? ఇంగ్లీషు స్కూల్లో ఏం చదివానో, అంతే. నా అంతట నేను ఒక్క ఇంగ్లీషు పుస్తకం చదవలేదు. నా: కర్థం కాదు".

"బాగుంది, ఇంగ్లీషు రాకపోతే



చదవనట్లా ? మామయ్య లాగానే మాట్లాడుతున్నావే! ఇంకెప్పుడు అనకు, నువ్వు చదువుకోలేదని" అన్నది అనంత "డాబా మెట్లక్రింద వున్న గదిలో పాత పుస్తకాలు పత్రికలు, ఏనాటివో ఎన్నో వున్నాయి. మామయ్య చిన్నప్పటివి, అత్తయ్య పెళ్ళయి వచ్చేప్పుడు మా యింటి దగ్గరనుంచి తెచ్చుకున్నారట. ప్రబంధాలు — అవీ బోలెడున్నాయి. వెళ్లి చూద్దాం. నీకు నచ్చే వేమైనా దొరుకుతాయేమో" అన్నది అనంత. ఇద్దరు గది తాళం తీసి పుస్తకాలు దులపడం మొదలు పెట్టారు.

ఆ గదిలో వున్న పుస్తకాలు రకరకాలవి. నారాయణరావు తండ్రి రోజూ చదువుకునే సంస్కృత లిపిలోనున్న రామాయణం, భాగవతం, నారాయణరావు తల్లి తాలూకు అష్టాదశ పురాణాలు, నారాయణరావు మద్రాసులో చదువుకునే రోజుల్లో కొన్న నవలలు ఒక పెద్ద కట్ట, జానకి పేరు వ్రాసుకున్న కళాపూర్ణోదయం, మనుచరిత్ర అన్నీ బైటపడ్డాయి. ఇహ పత్రికలు పాత మోడరన్ రివ్యూలు, త్రివేణి పత్రికలు, జస్టిస్ పార్టీ పత్రికలు, హిందూసుందరి పత్రికలు కట్టలుగా పెట్టివున్నాయి. "ఇవన్నీ ఎందుకింత భద్రంగా దాచివుంచారు" అనడిగింది మోహిని. 'మామయ్యకు ఎప్పుడో ఏదో జ్ఞాపకం వస్తుంది. తాళంతీసి యీ గదిలో కూర్చుని గంటల తరబడి కావలసిన పత్రిక కోసం వెతుక్కుంటూరు" అంది అనంత. వాటిల్లో మోడరన్ రివ్యూల కట్టతీసి, "మోహినీ, వీటిల్లో చక్కని చిత్రాలున్నాయి. దేవీప్రసాద్ వాళ్ళవి, చూడు" అని యిచ్చింది అనంత. అంతలో పని మనిషి వచ్చి ఓ పుస్తకం అనంతకిచ్చి బాలకృష్ణగారు పంపారంటండీ, పుస్తకం తెచ్చిన కుఱ్ఱాడు నుంచున్నాడు. వెళ్ళమని చెప్పమంటూరా" అన్నది. "ఊం వెళ్ళమని చెప్పు" అన్నది అనంత పుస్తకం తీసుకుని

"ఎవరతను, మీ క్లాస్‌మేటా" అని మోహిని అడిగింది

[సశేషం]

# మితవాది

[ బాణం ]

**రం**డి సార్ — కూచోండి— ఏవిఁటి బొత్తిగా ఈ పక్కకి రావటమే మానేశారూ ? — బోయ్ !— టింగ్ ... టింగ్ ... టింగ్ ...

... ఓ కాఫీ పట్రా ...

అవునుగాని, నే నడిగిన సంగతేం చేశారూ ? — ఏవిఁటూ ?— హాఁ ! — అప్పుడే మమ్మల్ని మరిచే పోయారూ ?—ఊఁ—ముందు కాఫీ తీసుకోండి, చల్లారి పోతుంది.

నేనా ?—వద్దు సార్. నే కాఫీ తాగను. పాలే చిన్నప్పట్నించీ పాలే అలవాటు. అహఁహఁ ! — అబ్బే. ఇప్పుడే పుచ్చుకున్నా సార్. మీరు కానీండి.

ఊఁ—ఏవిఁటిసార్, సంగతులూ ?— నేను ఇల్లు కావాలన్నా. జ్ఞాపకముందా, సార్ ?—ఉందా ?—ఎక్కడండీ ?—ఎంత అద్దె ? — చెప్పండి, చెప్పండి ...

అబ్బే — అంత దూరం లాభం లేదు, సార్. స్టేషన్ కి—లేదా బస్ స్టాండ్ కి అయిదు నిమిషాల దూరం మించకూడదు. పైగా — ఇప్పుడు నే నిస్తున్న అద్దెకూడా చాలా తక్కువేనూ !—

ఒక్క సంగతి వినండి — అద్దె తక్కువలో కావాలి. అంటే — ఇప్పుడు నే నిస్తున్నకంటె తక్కువలో అన్నమాట. అన్ని సదుపాయాలూ ఉండాలి. ఇంటివాళ్ల పోరు ఉండకూడదు. ఇరుగూ పొరుగూ మంచివాళ్ళుగా ఉండాలి. చంటీ — వెంటీ, ముసిలీ — ముక్కీ ఉండకూడదు. దొంగల భయం, దోమల బాధా ఉండకూడదు. మొక్కా మోడూ వేసుకుందుకి కాస్త ముందూ వెనకా పెరడుండాలి. ఇంట్లో కరెంటు ఉండే తీరాలి. షాకు కొట్టకూడదు. ఎలక్ట్రి బిల్లు ఇంటివాడే కట్టుకోవాలి. ఇంత కరెంటు ఎందుకాల్చిందీ అని ఎవడూ అడక్కూడదు. మావాళ్ళకి కాస్త దైవమూ, భక్తీ ఎక్కువ. కనక దేవుడి పటాలు తగిలించుకుందుకి ధారాళంగా గోడలకి మేకులు కొట్టుకోనివ్వాలి.

మా అబ్బాయి స్కూటరు కావాలంటున్నాడు. రేపోమాపో కొనేస్తా.

---

ముద్దా చిట్టిబాబు

---

కనక అది పెట్టుకుందుకి ఒక చిన్న గారేజీలాంటిది ఉండాలి.

మరొక సంగతి: ఇల్లు తనదికదా అని ఇంటాయన తరుచు మా యింటికి వస్తాడేమో, పనికిరాడు. వాడిల్లు మాకిచ్చినందుకుగాను మేం రమ్మన్నప్పుడు వచ్చి, కిక్కురుమనకుండా అద్దిడబ్బులు పట్టుకెళ్ళాల్సిందే. అంతే. మాటిమాటికీ అద్దె పెంచటంగాని, ఇల్లు ఖాళీ చేయమనటంగాని ... ఇలాంటి పిచ్చి పన్లు ఏం పనికిరావు.

ఇంటికేవేనా రిపేర్లూ అవీ వస్తే, వెంటవెంటనే చేయించాలి. లేకపోతే చెప్పకుండా మేమే చేయించి, అద్దిలో విరగ్గోసి పారేస్తాం.

నాకు మాటపట్టింపు జాస్తీ, తెలుసుగా? - అద్దెకున్నవాళ్ళం కదా అని ఇంటివాళ్ళు మామీద జులుం చెలాయిస్తే పడేవాళ్ళంకాము. ఎంతమాత్రం సహించం. వాడెంతచేను, వాడిల్లెంతజేసు!-అయినా మామీద జులుం చెయ్యటానికి వాడెవడండీ పుల్లయ్య? ఇదిగో, ఏఁవండోయ్!- ఒకటేమాట చెబుతున్నా - నేనెవడి జోలికిపోను, నాజోలికెవడేనా వస్తే ఊరుకోను. ఆరు నూరయ్యేది, నూరు ఆరయ్యేది-హైకోర్టు కెక్కించందేనిద్దరోను. తెలిసిందా, అం?-

ఆఁ - ఆఁ - ఉండండి. అప్పుడే లేస్తారేం? - పనుందా? - సరే - రండి, నేనూ అందాకా వస్తా ...

***






మా యింటిపేరు, 'వూరు పేరు కూడా ఒంగోలే – నా పేరు లక్ష్మి. మా నాన్నగారి పేరు బసవయ్య. మా అమ్మ పేరు పార్వతి. మా నాన్నగారు చాలాబలంగా, పుష్టిగా, గంభీరంగా వుండేవారు. ఆయన్ని ఎందరో వరించారు. ఆయనమీద మోజుపడి, పొరుగూళ్లనుంచి కూడా ఆయన కోసం వచ్చేవారు. మా అమ్మకు సవతులు చాలా మంది వున్నారు. కాని, వాళ్ళు ఎప్పుడూ మా అమ్మతో పోట్లాడేవారు కాదు.

నా చిన్నతనంలోనే మా వంశ ప్రతిష్ఠ విన్న ఒకాయన గోదావరి ప్రాంతం నుంచి మా యింటికి వచ్చారు నన్ను చూసి, మెచ్చి, తమ ఊరు తీసుకెళ్తా నన్నారు. అందుగ్గాను మా యజమానికి డబ్బు కూడా యిచ్చారు. నేను వెళ్ళిపో తున్నానని మా అమ్మ చాలా బాధ పడింది. మా యజమాని పిల్లలు – నాతో చిన్నతనంలో ఆడుకున్న వాళ్ళు – నన్ను వదిలి వుండలేక ఏడ్పు మొదలెట్టారు వాళ్ళ నాన్న గారు – పాపం! – వాళ్ళందర్నీ దబదబా బాది లోపలకు తీసు కెళ్ళారు. నన్ను కొన్నాయన కూడా నన్ను మా అమ్మనీ విడదీస్తున్నందుకు బాధ పడ్డారు. నేను కూడా కళ్ళ నీళ్ళు ఆపుకుని గుండె రాయి చేసు కుని ఆయనవెంట వెళ్ళాను.

ఆయనా నేనూ పగలు నడిచి

నంత నడిచి, రాత్రులు నిద్ర పోయి వాళ్ళ యిల్లు చేరాము. నేను యింటికి రాగానే మా 'అమ్మగారు' ఎదురొచ్చి 'లక్ష్మి వచ్చిందిరా' అంటూ హారతియిచ్చి, నన్ను లోపలకు తీసుకెళ్లారు.

అది చిన్నపల్లెటూరు. ఊరు చిన్నదైనా చాలా అందంగా వుంది. నాకు ఆ ఊళ్ళోనే పెళ్ళయింది. శ్రీవారి పేరు ... ఎలా చెబుతాను? ... సిగ్గుకాదూ? ... ఆయనది ఆ వూరు కాదు. ఆ పక్క నేవున్న మరో పల్లెటూరు. ఆయన ఆ వూళ్ళోనూ—నేను ఈ వూళ్ళోనూ కాపురం. మా తొలి సంతానం కోడెగాడే! ముద్దుగా తండ్రి పోలికనే వుండేవాడు. వాణ్ణిచూస్తే నాకు ఆయన్ని చూస్తున్నట్లే వుండేది. అందుకే ఆయన ఇంటిపట్టున వుండకపోయినా నేను కాలక్షేపం చేయగలిగాను.

మా ఊరు పచ్చగా కళకళలాడుతూ వుండేది. ఊరుబయట విశాలమైన పచ్చిక బయళ్ళుండేవి! ఆ వూళ్ళోవున్న స్నేహితులమంతా కలిసి, అక్కడకు వెళ్ళేవాళ్ళం! మా అందరికీ తోడుగా కొందరు చిన్నపిల్లలు కూడా వచ్చేవారు. కొందరు పిల్లనగోవి వూదేవారు. ఆ పిల్లనగోవి వింటూంటే, ఎంతో ఆనందంగా వుండేది. మా శ్రమఅంతా మర్చిపోయేవాళ్లం. పగలంతా కడుపునిండా పచ్చికమేసి పొద్దుకుంకే సమయానికి యిళ్లకు తిరిగేవాళ్లం. వస్తూవస్తూ చెరువులో మేమంతా—మాకుతోడుగా వచ్చిన పిల్లలు గూడా — హాయిగా ఈతలు కొట్టుకుని మరీ యిల్లు చేరేవాళ్ళం.

ఇంటికి చేరేసరికి 'లక్ష్మి! వచ్చావా?' అని మా 'అమ్మగారు' ఎంతో ఆప్యాయంగా పిల్చి, అప్పటికే సిద్ధంగా వుంచిన చిట్టు, ఉలవలూ, కుడితీ అన్నీ పెట్టేది. అవి తింటూ పాలు యిచ్చేదాన్ని! ఆమె పాలు పితుకుతూ, "లక్ష్మి! మేము తిననివీ, తినలేనివీ నువ్వు తింటావ్! మేం యిచ్చిన నీళ్ళకు బదులుగా పాలు యిస్తున్నావ్. నీ ఋణం ఎలా తీర్చుకోగలం తల్లీ?" అంటూ వుండేది. ఆ మాటలు వింటూంటే, నాకు కొంచెం గర్వంగానే వుండేది. ప్రతీ శుక్రవారం ఆమె నాకు పసుపురాసి, కుంకుమపెట్టి పూజచేసేది. తెల్లవారుఝామునగుడిలోసన్నాయి వినబడేది! అది వింటూంటే, దేవుడికి మే మింత దగ్గరగా వున్నామా అని తోచేది! మా అమ్మగారు వచ్చి, "లక్ష్మి! మేనకేశ్వరస్వామికి పాలు కావాలిట—ఇస్తావా?" అని పిలిచేది. ఆ పాలు దేవుడికిఅభిషేకంచేసేవారు. నేనుఎప్పుడేనా,ఆదారినపోతూంటే, ఆ పూజారి నన్ను పిలిచి, అరటి పళ్ళు పెట్టేవారు.

ఆ ఊళ్ళో వున్నంతకాలం నా జీవితం హాయిగా వుంది. ఇంతలో వాళ్ళ అమ్మాయికి పెళ్ళయింది. నన్ను ఆ అమ్మాయితోపాటు అత్తవారింటికి పంపించారు.

అక్కుస్తీలో పచ్చికబీళ్ళు లేవుట! దేవాలయం వుందోలేదో నాకు తెలియదు. పల్లెవిడిచి బస్తీరావడం నాకు కొత్తలో కొంచెం కష్టంగానే వుండేది. అన్నిటికన్నా ముఖ్యం స్నానానికి మరీ యిబ్బందిగా వుండేది! మాఊళ్ళో రోజూ హాయిగా స్నానం చేసేదాన్ని! ఇక్కడ రెండు మూడు రోజులైనా స్నానం వుండేదికాదు. పాపం! వాళ్ళు మాత్రం ఏంచేస్తారు! వాళ్ళస్నానానికే నీళ్ళులేవు. నాలుగైదు రోజులకోసారి ఓ బొక్కెడు నీళ్ళు పోసి, నా ఒళ్ళు కడిగేవారు. ఉలవలు, చిట్టు అవి బాగానే పెట్టేవారు. ఈమాత్రం పచ్చగడ్డి తెచ్చి నాముందర పడేసి వెళ్ళిపోయేవారు. ఇరవైనాల్గుగంటలూనన్ను గాటకుకట్టి వుంచేవారు. మా వాళ్ళు ఎవరూ కనబడే వారుకారు. పొద్దున్నా, రాత్రీ ఒక నల్లటాయన సైకిల్ మీద వచ్చి గబగబా పాలుపితికి వెళ్ళిపోయేవాడు! ఇతను పాలు పిండుతూంటే ఎంతో బాధగా వుండేది! మా 'అమ్మగారి' దగ్గర అలవాటై వచ్చానేమో, ఈయన మోటుతనం భరించలేక పోయేదాన్ని! కాని ఏం చెయ్యను! ఎదురుగా మా అమ్మాయిగారు కూచుని వుండేది! ఆమెకోసం పాలు ఇచ్చేదాన్ని! వాళ్ళ పక్కింటామె రోజూ వచ్చి గ్లాసుడు పాలు అడిగి తీసుకెళ్ళేది. బిడ్డకి ఆమె పాలు యివ్వదట! అలా యిస్తే చిక్కిపోతావని ఆమె కెవరో చెప్పారట! ఇదేం విడ్డూరమో!

ఇంతలో వాళ్ళకి హైద్రాబాదు బదిలీ అయింది. వాళ్ళతో నన్ను తీసుకెళ్లాలనే అనుకున్నారు. నన్ను తీసుకెళ్తే వాళ్ళు యిబ్బంది పడిపోతారని వాళ్ళ నాన్నగారు ఒద్దన్నారు. "పోనీ మా వూరు పంపెయ్యండి" అని మా అమ్మాయిగారు బతిమాలారు. కాని, ఆమె మామగారు, "అరణం యిచ్చిన ఆవు మా సొత్తు, మా యిష్టం" అని నన్ను ద్వారపూడి సంతకు పంపించేశారు.

ఆ సంతలో అంతా మావాళ్ళే! దేశంలో అక్కరలేని ఆవులు యిన్ని వున్నాయా అనిపించింది. కాని, కొందరు మమ్మల్ని కొనుక్కునేందుకు వస్తారుగా! కొందరికి అక్కరలేకపోయినా కొందరికి కావాలికదా అని తృప్తి పడ్డాను.

నన్ను, మరో పది మందినీ ఒకాయన కొనుక్కు తీసుకు వెళ్లారు. మమ్మల్ని అందర్నీ రైలు ఎక్కించారు. మేమంతా కలిసి హైదరాబాదు చేరాం. మావాళ్ళతో కలిసి చేసిన రైలు ప్రయాణం నాకు ఏమంత శ్రమ అనిపించలేదు. అసలే మా వాళ్ళ మొహం చూడ్డానికి నేను మొహం వాచి వున్నానేమో, హైదరాబాదు చేరేసరికి నా ప్రాణం లేచి వచ్చింది. మమ్మల్నందర్నీ ఒక పెద్ద పొలంలోకి తీసుకెళ్ళారు. పెద్ద పచ్చిక బయ

ఉంది. కొంచెం పూడుపు భూమీ వుంది. అక్కడ కూడా పాపం - ఆయన మమ్మల్ని బాగానే చూసే వారు. జబ్బుచేస్తే లారీలో ఆస్పత్రికి తీసుకు వెళ్ళేవారు.

ఉన్నట్టుండి, ఎవరో ఆయనతో ఈపాలవ్యాపారంకంటే, ద్రాక్షతోట పెంచితే లాభసాటి అన్నారట! ఆ పచ్చిక బయలు అంతా ద్రాక్షతోట చేస్తూ మా అందర్నీ తలొకరికీ అమ్మేశాడు. అప్పుడు నేను గర్భవతిని. నన్ను ఒకాయన కొని తీసుకెళ్ళాడు-ఆయనదీపాలవ్యాపారమే. వాళ్ళింట్లో నేనుగాక, మరోరెండు గేదెలున్నాయి. మా అందర్నీ ఒక దొడ్డిలో కట్టేసేవారు. నాకు ఆ గేదెలతో వుండడం అసహ్యంగా వుండేది! ఎందుకంటే వాటికి శుభ్రం తక్కువ. అయినా ఏంచేస్తాం ! "సహజీవనం" చెయ్యాలిగా! అలాగే కాలక్షేపంచేశాను. నాకుఒబాబుపుట్టాడు. పెద్దవాడంత ముద్దుగా లేడు - ఏవిటో మరీ నీరసంగా పుట్టాడు. అది వాడి తప్పుకాదు. నేను వెనకటంత బలంగా లేను. నాకు బలమైన తిండిలేదు—బాబు పుట్టిన రెండు రోజుల తర్వాత నాకు కన్పించలేదు- చంపేశారని తెలిసింది. ఇంతవరకూ ఇలాంటి కష్ట మెరగను. తిండి సహించలేదు. నన్నెవరూ 'అయ్యో పాపం!' అని ఓదార్చలేదు. ఇంతలో ఒక 'చేత' పెయ్యను తీసుకువచ్చి, నా బిడ్డ అని భ్రమ పెట్టారు. ఆ మాత్రం నేను గుర్తు పట్టలేనను కున్నారు - ఒకరిలా మరొకర్ని భగవంతుడే సృష్టించలేక పోతున్నాడే! మానవుడికి సాధ్యమా! చచ్చినవాడి ఫొటోను బతికున్న వాళ్ళు పూజించినట్లు, ఆ చేత పెయ్యనే మా బాబు అనుకుని సరిపెట్టుకునేదాన్ని! అలాగే కాలక్షేపం చేస్తూ, వున్నంతలో పాలు యిచ్చేదాన్ని! నా పాలూ, గేదెపాలూ నీళ్ళతో కలిపి 'ఆవు పాలు' అని అమ్మేవారు. "నేను అమ్మేవి ఆవుపాలే అని నమ్మించడానికే నన్ను ఆయన కొన్నాట్ట! ఇదిచూస్తే మాత్రం నాకు చాలా అవమానంగా వుండేది! అక్కడ నాకు మళ్ళీ ఆడపిల్ల పుట్టింది. ఆడపిల్ల కనక చంపలేదట!

ఆయనెవరో నన్ను మా అమ్మాయినీ కొనుక్కుని, ఓపెద్ద యింట్లోకి తీసుకు వెళ్లారు. ఇల్లూ అదీ చూసి, హాయిగా తిరగొచ్చు - తినొచ్చు, నాకు మంచి రోజులు వచ్చాయి అనుకున్నాను. కాని, తీరా లోపలకు వెళ్ళేసరికి ఏవో మంత్రాలు వినబడ్డాయ్. పాపం! ఆ యింటి యజమాని పోయాట్ట! అయ్యో! ఇదేమిటి నేను కాలుపెట్టిన వేళా విశేషమా అనుకున్నాను. కాదు - ఆయనపోయి అప్పుడే పదిపన్నెండు రోజులైందట! ఆ రోజున మా వాళ్ళని యిలా దానంచేస్తే వాళ్ళ వాళ్ళకి చాలా పుణ్యమట! చచ్చిపోయిన ఆ పెద్దమనిషి యమలోకానికి వెళ్ళేప్పుడు అదేదో నదిని దాటు

దానికి బంగారపు ఆవు వస్తుందట! ఆ పోయిన ఆయన యమలోకమే పోతాడని వీళ్ళింత గట్టిగా నమ్ముతున్నారు– ఆయన అన్ని పాపాలు చేశాడా అనుకున్నాను.

ఆ దానం పట్టిన ఆయన నన్ను తీసుకు పోతున్నాడు. విధి వెంట నడిచిపోతూ, మా అమ్మాయిగారూ, అల్లుడుగారూ కనబడతారేమోనని వెతుకుతూ వెళ్ళాను. నా అదృష్టం బాగుంది. ఇద్దరూ చిలకా గోరింకల్లా కారులో వెళ్తున్నారు. వాళ్ళ పిల్లలు యిద్దరూ వారిమధ్య కూర్చున్నారు, వాళ్ళు నన్ను చూసినా గుర్తు పట్టలేరు. నా రూపే మారిపోయింది. ఓ గోడమీద ఏవేవో రాసి రెండెద్దుల బొమ్మలు వున్నాయి. వాళ్ళని చూస్తే మా అబ్బాయిలు జ్ఞాపకం వచ్చారు. రోడ్డున పోతూ ఆ బొమ్మల్ని చూసిన ఒకాయన పక్కాయనతో– "ఈసారి కాడెద్దులకు భలే పోటీలే!" అన్నాడు. ఆయనకు తాళంవేస్తూ — "లేకపోతే ఏమిటయ్యా — మరీ అన్యాయంగానూ అధ్వాన్నంగానూ వుంది" అన్నాడు. "ఈ అధ్వాన్నానికీ, అన్యాయానికీ చిహ్నంగా మా బిడ్డల్ని ఉపయోగిస్తున్నారా" అనుకుని నాలో నేనే



బాధపడ్డాను. ఒక్కసారి మా 'అమ్మ గారు' పల్లెటూరూ జ్ఞాపకం వచ్చారు. కళ్ళనీళ్ళు తిరిగాయి. బాధపడి మాత్రం ఏం లాభం? మా బిడలు ఎక్కడున్నారో! ఎలా వున్నారో! ఏం చేస్తున్నారో! అని బాధపడుతూండగా, ఏవో వినరాని మాటలు వినబడ్డాయి — ఆ భాష నాకు తెలియదు. నే నెప్పుడూ వినలేదు. ఆ మనిషి కూడా మరీ కటువుగా వున్నాడు. ఒక్కసారి వెనక్కి తిరిగి చూశాను. నా వెనకాల నాకన్నా చిక్కిపోయిన వాళ్ళు చాలామంది వున్నారు. మేమంతా లోపలకు వెళ్ళడానికి చాలా ఆలస్యమవుతుందట! ఆ పక్కనున్న ఒకావిడ నన్ను పలకరించింది. కాస్సేపు కష్టం సుఖం మాట్లాడుకున్నాం — ఆమె కథ మరీ దీనంగా వుంది. ఆమె జీవితం అంతా మదరాస్‌లోనే గడిపిందట! ఆజీవితం మరీ కృత్రిమమట! పెళ్ళి పేరంటం అలాంటివి ఏమీ లేవుట! బిడ్డలు మాత్రం పుట్టేవారట! కాని, ఒక్కరూ దక్కలేదట! అంతే దక్కించలేదట!

"మనం యిక్కడికి ఎందుకు వచ్చినట్టు" అని మరొకామె అడిగింది.

"మానవుడికి మనం చేసిన సేవకి కృతజ్ఞతగా మనల్ని స్వర్గానికి పంపుతున్నాడు" అంది ఒకామె.

"అయితే, మానవుడు మంచి వాడే"

"ఏం మంచి? నా మొహం మంచి— మనం బతికున్నంత కాలం చంపుకు తిన్నాడు? అది చాలక చచ్చిం తర్వాతకూడా తింటాడట! కృతఘ్నుడు!"

"అలా అని ఎందుకనుకోవాలి? మన జీవితం అంతా మానవుడికి వుపయోగపడుతున్నాం అని గర్వపడాలి— అంతేగాని, ఈ వయసులో మనం ఏం చేస్తాం? ఎక్కడికి పోతాం? కోపగించిపోతే, మద్రాసావిడలాగ గోడమీదవున్న పోస్టర్లు తినాల్సిందే!"

"మన ప్రాణాలు తీసినా ఫర్వాలేదు. మన బిడ్డల ప్రాణాలు తీయక

పోతే అంతే చాలు! మనకి వెనకటి జీవితమూ ఒద్దు — ఆ గౌరవమూ ఒద్దు—"

"మనల్ని వధించరట" అంది ఒకామె.

"హా!" అని ఒకామె కుప్పలా కూలిపోయింది. మేమంతా ఆమె దగ్గరకు వెళ్ళి చూశాం. ప్రాణాలు పోయాయి - "అయ్యో! పాపం!" అనుకున్నాం.

"ఇక్కడకు రాగానే తనకష్టాలు గట్టెక్కుతాయని గంపెడాశతో ఆమె వచ్చింది. తీరా చంపడం తెలిసి ఆ నిరాశతో గుండె ఆగి మరణించింది" అని ఆమెతో ఏభైమైళ్ళు నడిచివచ్చిన మరొకామె చెప్పింది.

"చచ్చినా, చంపబడినా చావుకు ముందూ, చావుతర్వాత కూడా నేను మానవుడికి వుపయోగపడుతున్నాను. చావుతర్వాత ఎవరికీ వుపయోగపడని మనిషికన్న నేనే గొప్ప" అనే తృప్తితోనే నా జీవితం గడపాలని నిశ్చయించుకున్నాను.

***



# ఈ ప్రయాణం తప్పదు

గోపాల చక్రవర్తి

నడుస్తున్నాను నడుస్తున్నాను
వడిగా ముందుకు సాగాలని పట్టుతో గట్టిగా
అడుగు వేస్తున్నాను
ఎంత దూరమైనా నడవాలని నిశ్చయించుకున్నాను
పెనుగాలి వీచినా చిరుదీపం లేకపోయినా
దారిలో చేయూత దొరికినా దొరక్కపోయినా
విశ్వత్రాతను స్మరిస్తూ ముందుకు పోతాను
నా ప్రయాణం విరమించను
అనుకోకుండా మార్గమధ్యంలో
ఓ అమ్మాయి సప్తద్వీపపు ఏకైకరాణి
ఓ సుగుణ నా మనస్స్థిరతన్వి
ఓ ఊర్వశీ హెప్‌బర్న్
తన వెండిరథంలో కనిపిస్తే
లిఫ్టు దొరుకుతుంది
అప్పుడు బారోడ్ వైభవంతో ముందుకు సాగిపోతాను
ప్రమోద సంపదతో ప్రయాణిస్తాను
ఆమె పెదిమలమీద వెలుగు
దారిలో చీకట్లను తొలగిస్తుంది
నితాంత రసవంతం అవుతుంది ఈ జీవిత కావ్యం
లేదా ఏ జ్ఞానవృద్ధుడో కనిపించి
నన్ను ప్రజ్ఞుణ్ణిచేసి దూరతీరాలకు
షార్టుకట్ చూపించవచ్చు
లేదూ దితకామాళి ఏ మహాసిద్ధుడో
కనిపించి పసరు ఇస్తే

ఏ మహా వైజ్ఞానికవేత్తో ప్రపంచం ఇదివరకు చూడని
కొత్త శకటాన్ని నా కోసం కేటాయిస్తే
అపుడు ఆకాశ లోకాల్లో విహరించి
గరుడ గంధర్వ యక్ష కిన్నరుణ్ణవుతాను
నిలింప వ్రాతంలో ప్రవేశిస్తాను
దివారాత్రాలు కాస్సేపు మర్చిపోతాను
ఇవేవీ కాకపోయినా నిజభుజ శౌర్యాన్ని నమ్ముకున్న
ఏ బలాఢ్యుడో తగిల్తే దారిలో
భుజంమీద చేయివేసి ధృతితో గతి తప్పక
నడవడానికి ప్రయత్నిస్తాను
లేదా తరతరాల భారతీయ ఆధ్యాత్మికత రూపురేఖలు
దాల్చినట్లు కనపడే ఏ భక్తుడో బక్కవాడో
నిజం నిజం యతి కనిపిస్తే
నా అలసట పోతుంది
స్వాంతం శాంతం అవుతుంది
అప్పుడు ఈ ఆప్తునితో ప్రయాణం చేస్తాను
ప్రయాణం మాత్రం మానను
నియతి అలంఘ్యం
మనలో చాలామందికి దీర్ఘప్రయాణం తప్పదు
మహాదేవుడు కరుణిస్తే
అంబికానాథుడు అనుగ్రహిస్తే
ప్రయాణం విహారంగా మారుతుంది
మనస్సు పూలమాలయై
స్వామి పాదాల దగ్గర నిలుస్తుంది.




కె. సురేష్

"బాబోయ్, బాధభరించలేక పోతున్నాను. నన్ను చంపెయ్యండి" 17వ నంబరు బెడ్ మీద పడుకున్న పేషెంటు ఉండుండి అరుస్తున్నాడు. అంతకు తప్పితే మా వార్డంతా ప్రశాంతంగా ఉంది. సిస్టర్‌తో చూస్తుండమని చెప్పి నేను హౌస్ సర్జన్స్ రూంకి వచ్చేశాను.

నేను రూములో అడుగు పెట్టేసరికి ఎదురుగా విశ్వం, నారాయణ కూర్చుని ఉన్నారు.

'ఒరే రాజూ, చలపతిగాడు రాలేదేం' అన్నాడు నారాయణ.

'థియేటర్‌లో ఉన్నాడు. ఎపిండిసైటిస్' కేస్‌కి ఎసిస్ట్ చేస్తున్నాడు' అన్నాను. చలపతి వచ్చేసరికి ఎలా అయినా ఓ అర్థగంట పడుతుందని మేము దూరాన ఉన్న కాకా హోటల్లో టీ త్రాగటానికి బయలు దేరేము. ఊళ్ళో లైట్లన్నీ ప్రశాంతంగా, చుట్టూ పురుగుల్ని మాత్రమే చేర్చు

కుని మిణుకు మిణుకు మంటున్నాయి. టైమ్ము పదకొండున్నర అయింది. ఆరోజు మా నలుగురికీ నైట్ డ్యూటీ. మేంహౌస్ సర్జన్లమే కాబట్టి కించిత్తయినా కించపడకుండా కాకా హోటల్లో దూరాము.

వాడు "టీ" అని చెప్పి ఇచ్చిన రంగు నీళ్ళని గుటకలేసుకుంటూ రాడర్ ఆపురావురు మనుకుంటూ తాగి బయట పడ్డాము.

* * *

కుర్చీల్లో కూర్చుని సిగరెట్ వెలిగించామో లేదో చలపతి వచ్చాడు. "సారీ గురూ, ఎపిండిసైటిస్, ఎమర్జన్సీ కేసు, అందుకని రాలేకపోయాను. అసలీ సర్జికల్ పోస్టింగంతా ఇట్లానే అయ్యేట్టుంది. నిమిషం తీరికుండదు" అన్నాడు.

"అది సర్లే, ఈ రెండు గంటలూ మన కాలక్షేపం ఎట్లా?" అన్నాడు నారాయణ రెండుగంటలకి ఆర్. యం. ఓ. వస్తాడన్న భయంతో.

పేక పత్రానందుకు నన్ను నేను నిందించుకున్నాను. "ఐతే తలా ఒక ప్రేమకథా చెబుదాం" అన్నాను. నా ప్రపోజల్‌ను ఇద్దరూ సపోర్టు చేశారు కాని, నారాయణ మాత్రం "ఇంకా నయం. బేతాళకథలు చెప్పకుందాం అన్నావు కాదు" అన్నాడు.

చివరికి ఎట్లా అయితేనేం నారాయణని ఒప్పించాం.

మొదటి కథ వాడే ప్రారంభించాడు. "అబ్బాయిలూ, మా నాన్న చూపించిన అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాను. తర్వాత హాయిగా ప్రేమిస్తున్నాను. అంతే.'

విశ్వం అందగాడు. వాడు మా క్లాసమ్మాయి రాధను ప్రేమించాడు. వాళ్ళనాన్న ఒప్పుకో పోయినా పెళ్ళి చేసుకున్నాడు.

చలపతిఅన్నాడు 'నాదీ చాలాసింపుల్ మా మామయ్యగారమ్మాయితో మొదటు లవ్. తర్వాత మారేజి. అంతే.'

'ఐతే మీ అందరిదీ చక్కగా ఏ ట్రాజెడీ లేకుండా అయింది. ఐతే నాది కామెడీ లేని ట్రాజెడీ' అన్నాను.

"నువ్వు పెళ్ళిచేసుకోక పోటానికి ఇదే కారణమా?" విశ్వం.

"ఎంతమాత్రం కాదు ఇప్పుడు"

"ఐతే చెప్పు"

నేను ఫ్రెష్‌గా మరో సిగరెట్ వెలిగించి మొదలెట్టాను.

* * *

నేను నిరాశావాదిని. ఏ పని మొదలుపెట్టినా అది కాదేమోనన్న భయం నన్ను మొదట్నించీ పీడించేది. ఏనాడూ నేను అందగాణ్ణను కోలేదు. కనీసం అట్లా ఉంటానికి కూడా ట్రై చెయ్యలేదు. అఫ్‌కోర్సు ఇప్పుడు కాస్తకాస్త ట్రై చేస్తున్నా ననుకోండి.

కొత్తగా పి. యు. సి. పాసై బి. యస్ సి. లో చేరాను. నాకెప్పుడూ సినిమాల్లో హీరోలాగానూ, కథల్లో నాయకుడి లాగానూ ఒక అమ్మాయిని లవ్ చేయాలనీ ఉండేది. అవకాశం దొరక్క చాలా రోజులు అట్లాగే ప్రేమించకుండా, ప్రేమించ బడకుండా (అమ్మాయిచేత) ఉండి పోయాను.

మూర్తి, శాస్త్రి, నాకప్పట్లో రెండు భుజాలో లేక నేనే వాళ్ళిద్దరికీ చెరో భుజమిచ్చానో తెలీదు కాని, అమ్మాయిల్నేడిపించటం లోనూ క్లాసులు ఎగ్గొట్టటంలోనూ చాలా ఐకమత్యంగా ఉండేవాళ్ళం.

క్లాసులో కెళ్ళగానే అమ్మాయిల వెనకాల జేరటం, రాకెట్ మార్కు యారోస్, చిన్న చాక్ పీసుముక్కలూ విసరటం మొదలు పెట్టేవాళ్ళం.

ఇలా చాలా తక్కువ రోజులు గడిచాయో లేదో, మా ఇంటి ముందింట్లోకి ఓ అగ్రికల్చరల్ ఆఫీసరుగారు పదిహేడేళ్ళ నల్లటి కూతురితో సహా దిగారు. ఆ అమ్మాయి నల్లగా ఉన్నా చాలా అందంగా ఉంది. వాళ్ళింట్లో ఓ తుపాకి గూడా ఉందని మా తమ్ముడూ, ఆయన వేటగాడని మా నాన్నా చెప్పారు.

మర్నాడు కాలేజికి కాస్త ఆలస్యంగా వెళ్ళాను. సైకిల్ స్టాండ్ వేస్తుంటే 'ఆ వచ్చాడు గురుడు' అంటూ ఫిజిక్స్ లాబ ముందున్న మూర్తి, శాస్త్రీ నాదగ్గరికి వచ్చారు. వస్తూనే మూర్తి మొదలెట్టాడు. "ఒరే రాజా ఓ గుడ్ న్యూస్. మనక్లాసులో కొత్తగా ఓ అమ్మాయి చేరబోతోంది. పేరు రాజలక్ష్మి. ఇవాళ్టి నుంచీ నాలుగు రోజులు ఆ అమ్మాయిని బెదరగొట్టొచ్చు.

"ఒరేపిచ్చిసన్నాసీ. ఆ అమ్మాయి అసలే సిసింద్రీ. ప్రొద్దున్నే పాల మనిషితో అర్ధగంట లడాయి వేసుకుని దాన్ని బెదరగొట్టింది. వాళ్ళ నాన్న ఆఫీసరు. పైగా వాళ్ళింట్లో ఓ గన్ కూడా ఉంది" అన్నాను.

దాంతో మూర్తి చల్లబడ్డాడు. 'ఒరే రాజా, సర్లే, ఆ అమ్మాయిని బెదరగొట్టొద్దు కాని ఆ అమ్మాయిని చూసి మనమే బెదురుదాం. ఎన్నాళ్ళనుంచో లవ్వో లవ్వో అని ఏడుస్తున్న నీకిది మంచి అవకాశం. జాగ్రత్తగా [illegible] కుంటావో లేక అట్లా [illegible] లేదుస్తావో' అన్నాడు.

శాస్త్రి మాత్రం 'గన్', 'ఆఫీసరు' అన్న పదాలు వినగానే దూరాన ఉన్న కాంటీన్ వైపు గోళ్ళు గిల్లుకుంటూ చూస్తున్నాడు.

సరే ఆలోచిద్దాం అంటూ క్లాసు వైపు దారితీశాను.

చెప్పుకోదగ్గ ఘటనలేవీ జరక్కుండా ఓ నాల్రోజులు జరిగిపోయాయి. అనుకోకుండానే ఆ




ెర్వాత|మరో ఐదు-గోజులు గడిచి పోయాయి. షుమారుగా ఏడుగంటల రాత్రి సమయం. పదనరోజుకూడా ఇరిగిపోతోంది అనుకుంటూ ఇంట్లోకి రాగానే మా తమ్ముడు నా రూంలోకి వచ్చాడు.

'మరే అన్నయ్యా, వాళ్ళ రాజ లక్ష్మి లేదూ? మీ క్లాసే చదువు తోందే, రోజూ కాలేజికి రిక్షాలో వెళుతుందిచూడు, ఆ అమ్మాయే నిన్నడిగి బోటనీ రికార్డు పట్రమ్మం దన్నయ్యా."

నేను హడావుడిగా మిగిలి పోయిన కాగితాలను కొన్ని డయా గ్రమ్స్‌తో పూర్తిచేసి "నువ్వు పోరా వెధవా' అని వాణ్ణి కసిరి రికార్డు ఒక చేత్తోను, రేటు 92 దాటి ఇంకా వేగంగా కొట్టుకుంటున్న గుండెను మరో చేత్తోను పట్టుకొని రాజలక్ష్మి ఇంట్లోకి వెళ్ళాను.

అప్పటిదాకా కిటికీలోంచి

చూస్తున్న రాజలక్ష్మి నన్ను చూసి గుమ్మంలోకి వచ్చి "రండి" అంది. అని ఊరుకోకుండా "అరే మీరే పత్రూవాలా? మీ తమ్ముడితో పంపితే పోయేదిగా?"

"ఆ రికార్డు ఇన్‌కంప్లీటండీ. ఈ విషయం చెప్పటానికే వచ్చాను. ఇక వెడతాను" అన్నాను.

"అబ్బెబ్బే కూర్చోండి" అంది కుర్చీ చూపిస్తూ.

ఓ రెండు నిమిషాలయినతర్వాత సంభాషణల్లోకి దిగాము.

"ఏమండీ రాజుగారూ, మీ పూర్తి పేరేమిటండీ?"

"ఆఁ ఏదో బాగుండదు లెండి.'

"ఫర్వాలేదు చెప్పండి."

'గోవిందరాజండి.'

'మీ పేరు కేమండి? నా పేరు చూశారా రాజలక్ష్మి. వరలక్ష్మి, గృహలక్ష్మిల్లా. చక్కగా ఏ సునీతో, సరళో, మృణాళినో అని ఉండక.'

'అబ్బే మీ పేరు చాలా బాగుందండి' అన్నాను ఏమనాలో తోచక.

ఇలా తలా తోకా లేని సంభాషణ లయిన తర్వాత 'రికార్డు మళ్ళీ త్వరలో ఇచ్చెయ్యండి. అబ్బే నేనే ఎల్లుండి వస్తాను' అని చెప్పి వచ్చేశాను.

ఆ రోజుతో నా కెంతో విజయం సాధించి నట్లయింది. రాజలక్ష్మి నాకు చాలా దగ్గరగా వచ్చినట్లు ఫీలయ్యాను.

అలా వీలయి నప్పుడల్లా మాట్లాడుతూ, చాలా చనువు తీసుకున్నాను. మా పరిచయం నువ్వు, నువ్వు అని మాట్లాడుకోటమే కాకుండా క్యాంటీన్‌లో కలిసి కాఫీ తాగటం వరకూ వచ్చింది. ఏరోజనా సినిమాకో లేక అలా చల్లగాలికి పార్కుకో వెళితే బాగుండుననిపించేది. కాని రాజలక్ష్మి రాదేమోనని నేనే అడగలేదు.

అలా, అలా మా పరిచయం వృద్ధి అయ్యేసరికి మార్చి వచ్చింది. మమ్మల్నందర్నీ పరీక్షలు రాయమన్నారు ప్రిన్సిపాలుగారు. ఏదే ఎలాగో ఇంటి పరీక్షల్లో ('ప్రిపరేటరీ ఎగ్జామ్స్) గట్టెక్కి [illegible] చేరుకున్నాము.

* * *

రోజు లిట్లాగే గడిచిపోతే చాలా బాగుండేది. కాని అట్లా జరగలేదు. సెకండియర్ మొదట్లోనే రాజలక్ష్మి ఫాదర్‌కి శ్రీకాకుళం ట్రాన్స్ఫరయింది. ఇంకా కొద్ది రోజుల్లో వాళ్ళు ఊరువదిలి పోతారనగా నేను నా ప్రేమాయణాన్ని బయట పెడదామనుకున్నాను.

ఓరోజు వాళ్ళింటి కెళ్ళగానే "రాజలక్ష్మి ఐ లవ్ యూ" అన్నాను. 'హ్హా..హ్హా ... హ్హా. భలేవాడివి రాజూ. నేను ఇంకేమిటో చెబుతున్నా వను

కున్నాము. తిరావింతే ఇదాళ అసలు రాజూ, నీకు ప్రేమ అంతే అర్థం తెలుసా. మన వయస్సెంత, మన చదువులెంత? తీరా నేను వెళ్ళబో యేరోజుల్లో ఇదా నువ్వు మాట్లా డేది?'

నేనేం మాట్లాడలేదు.

'సారీ రాజూ, నాకు పెళ్ళి గురించి చాలా గొప్ప అభిప్రాయా లున్నాయి. ఇలా ఇళ్ళల్లో పోట్లాడి చేసుకునే పెళ్ళిళ్ళంతే నాకు మంట. ఇలా అంటున్నానని నా మీద కోపం పెట్టుకోకు. మనిద్దరం మంచి స్నేహి తుల్లాగానే ఉండిపోదాం' అంది.

ఇట్లా సాగిన రాజలక్ష్మి ఉపన్యా సం ఓ పదినిమిషాల తర్వాత ముగి సింది. మరో పదిరోజుల తర్వాత 'లెటర్సు రాస్తుంటావు కదూ' అంటూ వెళ్ళిపోయింది శ్రీకాకుళం వాళ్ళనాన్నగారితో సహా.

ఈ దెబ్బతో ఆ సంవత్సరమంతా చాలా ఫీలయ్యాను చివరకు సెకం



డియరు ఫేలయ్యాను అతర్వాత ఇక లాభం లేదు, శ్రమించి సుఖిద్దామని విద్యారంగంలోకి దూరాను

*　*　*

"ఇదీ నాకథ."

"ఆ అమ్మాయి మళ్ళీ కనిపించ లేదా నీకు ?"

"కనిపించకేం, కనిపించింది ఈ మధ్యే" అన్నాను.

"మరి చెప్పు చెప్పు" నారాయణ

"ఫైనలియరు ప్యాసవగానే అలా తిరుపతివెళ్ళి గుండు చేసుకుని తిరిగి వస్తూంటే బెజవాడలో కనిపించింది "

నన్ను చూస్తూనే గుర్తుపట్టింది నేనే గుర్తుపట్ట లేకపోయాను తనసంగతి చెప్పింది— ముగ్గురు పిల్లలని, వారికి విశాఖపట్నంలో ఏదో కంపెనీలో ఉద్యోగమని, సంసారం చాలా సాఫీగా సాగిపోతోందని

'అది సరే రాజూ నువ్వేం చేస్తున్నావు ? ఎక్కడుంటున్నావు ? పెళ్ళయిందా' అంటూ అడిగింది

'ఆగాగు చెబుతాను మెల్లిగా. నేను బి. యస్సీ తో రెండేళ్ళు కుస్తీ పట్టి చదువు మానేశాను. ప్రస్తుతం హైదరాబాద్‌లో టీచరుగా పని చేస్తున్నాను. చాలీచాలని జీతం. చూస్తూ చూస్తూ మరో నిండు ప్రాణిని ఈ ఊబిలోకి దింపలేక పెళ్ళి చేసుకోలేదు" అన్నాను.

"మాశావారాజూ! ఆరోజే నేను కూడా ప్రేమ, ప్రేమంటూ పిచ్చిగా కలవరిస్తే నాగతిఏమయ్యేది? అమ్మో తలుచుకోటానికే భయంకరంగా ఉండేది ఈ స్వర్గం ఎక్కడ? అమ్మో నువ్వు చెప్పిన ఆ ఊబి ఎక్కడ?'

"అదిసరే. మీ వారెక్కడ?" అన్నాను.

"ఇప్పుడే కాఫీ పత్రావటానికి వెళ్ళారు, వస్తారుండు. పరిచయం చేస్తాను.'

"అబ్బే టైమయి పోయింది" అంటూ పరిగెత్తి కెళ్ళాను రైల్లోకి.

*　*　*

"రాజలక్ష్మి అంత స్వార్థంతో అప్పుడు నన్ను కాదన్నందుకు నేను ఎంతో బాధ పడుతున్నా ఇప్పటికీ."

"ఐతే నువ్విప్పుడు డాక్టర్ గోవిందరాజు యం. బి. బి. యస్. అని ఆ అమ్మాయికి తెలీదన్నమాట" నారాయణ అన్నాడు.

"తెలీదు."

"అట్లా టీచర్నని అబద్ధం ఎందుకు చెప్పావు?"

"ఆ అబద్ధం చెప్పకపోతే ఈ భయంకరమైన నిజం తెలిసేది కాదు కదా?"అన్నాను, అంతకంటే ఏమనాలో తెలీక.

***

అనగా అనగా ఓ హైదరాబాద్ నగరం. అందులో హిమాయత్ నగర్లో, బంజారా హిల్స్లో, పంజగుట్టో—ఒక ప్రాంతం. ఆ ప్రాంతంలో ఒక పెద్ద మేడ! ఆ మేడ దిగువన ప్రహరీగోడ కానుకొని ఒక చిన్న గూడు.

ఆ మేడలో మాధవి వుంటోంది

ఈ గూడులో మల్లయ్య వుంటున్నాడు.

మాధవి వయస్సుని క్రీమ్స్, పౌడర్లూ కప్పేస్తుంటాయి.

మల్లయ్య నల్లని ముఖాన్ని వయస్సు విప్పేస్తూ వుంటుంది.

మాధవికి పదేళ్ళ క్రితం బి ఎస్ సి ప్యాసయిన అయిదేళ్ళ తర్వాత పెళ్ళయిపోయింది.

మల్లయ్యకు, స్కూల్ ఫైనల్ ప్యాసయ్యి పదేళ్ళయినా యింకా పెళ్ళికాలేదు.

మాధవికి అట్నుంచీ యిట్నుంచీ ఖూశా బాగా డబ్బొచ్చింది దాదాపు రెండొందల చీరలూ, ఏడువారాల నగలూ ఆవిడకుంటే, మల్లయ్యకు ఎట్నుంచీ డబ్బు రాకపోగా అన్ని వేపుల్నుంచీ పీక్కుతినే జనాభా హెచ్చుగా వుంది.

ఆమె జరీ అంచు ఊదాగంగు షిఫాన్ చీర కట్టుకున్న రోజున, మల్లయ్య లిబర్టీ డిప్లాన్ షర్టూ, టెర్రీవూల్ ఫాంటూ వేసుకుంటే బావుంటుందనుకొని, ఇక్ష్వాకుల నాటి ట్రంకు పెట్టెనించి అరవయ్యో నంబరు నూలుబట్టలు వేసుకుని పోయేవాడు.

ఆమె ఫియట్ లో సాయంకాలం రిట్జ్ కి (కామోను) వెళ్ళేది.

ఈయన కాళ్ళమీద, బస్సు రద్దీకి జడిసి, ఇంటికి వచ్చేవాడు

అతను నెలకి ముప్ఫై యిచ్చి వుంటున్న ఆ గోడపక్క గూడు ఆ మేడ కల మాధవిదే హైదరాబాద్లో కొందరు పెద్దవాళ్ళు, వాళ్ళ లంకంత కొంపలకు చుట్టూ అయిదారు పిచిక గూళ్ళ లాంటి ఔట్ హౌస్లు కడతారు. అందుల్లో ఒకటీ అరా సర్వెంట్లకిస్తారు. మిగతావి హైదరాబాద్ కి కొత్తగా ఉద్యోగాలకు కొట్టుకొచ్చిన జనాభాకు యిస్తూవుంటారు. ఈ జనాభా చాలమటుకు బ్రహ్మచార్లూ, బ్రహ్మచారుల్లాంటి సంసార్లూనూ ఇలాంటి జనాభా నించి ఆ పెద్ద మేడకు నెలకు ముప్ఫై నించి ఏభై వరకూ గూడు

ఎన్. ఆర్. నంది

ఒకర్కింటికి అద్దెరావడమే కాకుండా, ఆ మేడకి ఈ గూళ్ళల్లోవున్న మను షులు ఆళ్ళేషియన్లలా కాపలాగా పనికొస్తారు కూడాను. ఇలాంటి ఆళ్ళేషియన్లనించి పెద్ద మేడకు మొత్తం నెలకి రెండు మూడొందలు దక్షిణ వస్తూవుంటుంది. అలా వచ్చే దక్షిణ తన కారు పెట్రోలు కన్నా వస్తుందని మాధవి అనుకునేదేమో మనకి తెలీదు.

మల్లయ్యను మొదట్లో ఆ మేడకు పరిచయం చేసింది బుల్లెయ్య అనే పెద్దమనిషి. బుల్లెయ్యకూడా వొకా నొకప్పుడు మాధవి మేడకింది గోడ పక్క గూడులోనే వుండేవాడు.సచివా లయంలో ఎప్పుడో ఎల్. డి. సి. గా చేరి యు. డి. సి అయి, పై [illegible] రికమండేషన్, వెనుకబడిన తర గతుల వాళ్ళ హక్కుతో ముందు కొచ్చి సూపరెంటెండు మలక్ పేటలో గవర్నమెంట్ ఇల్లు దొరికాక, సగం వాటా ఒక స్టెనోగ్రాఫర్ అమ్మాయి కిచ్చి తను మాధవి గూడు వదిలేస్తూ, అది మల్లయ్యకు చూపిస్తూ "అబ్బాయ్! ఈ గదిని స్వర్గంలా చూసుకొని జాగ్రత్తగా వుండు. ఈ నగరంలో కొంప దొరకదు – మినిస్టరయితే తప్ప. నువ్వు మినిస్టరివీకాదు, వెనకబడిన తరగ తులవాడివీ కాదు. కాబట్టి దీంతోనే సరిపెట్టుకో అద్దె ముప్పై. అద్దెమాట కేంగానీ, ఈ యింటి యజమాను రాలు–మాధవీలతాదేవి–మహాగొప్ప, అందగత్తెలే! ఈ గూడులో వెల్లి కిలా పడుకుని పైకి చూస్తే, ఆ కిటికీలోనించి ఆమె అటూ యిటూ తిరుగుతూ కనిపిస్తుంది అప్సరసలా! రాత్రిళ్లు మాత్రం చూడకు ఝడుసు కుని జెంగెట్టుకుంటావ్" అని ఆ గూడులో మల్లయ్యనిదింపి బుల్లెయ్య చక్కాపోయాడు.

బులెయ్య చెప్పిన అప్సరసను చూడాలని మొదటిరోజునే మల్లయ్య మహా యిదై పోయాడు. రోజంతా కాపేసి కిటికీవేపు చూశాడు. ఆమె కనిపించలేదు. రాత్రి పన్నెండు వరకూ చూశాడు. అప్పుడూ కని పించలేదు. ఆ మర్నాడూ, ఆ వలి మర్నాడూ చూసిచూసి విసుగెత్తి పోయి, బుల్లెయ్య [illegible] మర్నాడు [illegible] సిద్ధము చేశాడు. [illegible] రాత్రి మాగన్ను పడుతూవుంటే ఎక్కణ్ణుంచో పెద్దనవ్వులు వినిపిం చాయి. గప్పునలేచి చెవులు రిక్కించి విన్నాడు. నవ్వులు పైనించే వస్తున్నాయి. ఒక నవ్వులు కావు: రెండు నవ్వులు. ఆ సన్నగా వినిపిం చేది నవలామణివి. మోటుగా విని పించే మాటలు మగ మహారాజువి. పైకిచూశాడు కిటికీలో ఒకఅమ్మాయి కనిపించింది రెండు జడలున్నాయి. నిండుగా నవ్వుతోంది. ఆకుపచ్చని



డెకరాన్ జాకెట్టు దాని తాలూకు గుండ్ర భుజాలు కాని రెండో భుజంమీద వుండాల్సిన పైట కని పించక ఉలిక్కి పడ్డాడు ఆమె నవ్వుతూనే కళ్ళు పక్కకి తిప్పి మాటాడుతోంది. ఆమె జాకెట్ బటన్స్ విప్పింది. మల్లయ్య నిజంగానే జడుసుకుని తలుపులు దగ్గరకు వేసేసుకుని సందులోంచి పైకి చూస్తున్నాడు. నగ్నంగా వున్న ఆమె నాభి పై భాగమంతా పాల మీగడలా ఎత్తుపల్లాల్తో నిగనిగ లాడుతూ కనిపిస్తోంది "పరాయి స్త్రీ బట్టలు మార్చుకుంటూంటే అలా తలుపు సందుల్లోంచి చూడొచ్చురా ఇడియట్" అని మల్లయ్యలోని మల్లయ్య జెల్లకొట్టాడు. ఉలిక్కిపడి "అవును సుమా" అని తప్పుకున్నాడు

కాని పడుకున్న మల్లయ్యలోని

మరో - అసామి మల్లయ్యను బల వంతంచేసి ఓపాడు.

మళ్ళీ మల్లయ్య తలుపు సందులోంచి చూశాడు. ఆవిడిప్పుడు తెల్లని సిల్కు నెట్ గౌన్ వేసుకుంది గౌను ఎక్కడుందో, ఆవిడ తెల్లటి చర్మం ఎక్కడుందో తెలుసుకోవడం ఒక పరీక్షయింది మల్లయ్యకు ఆమె మళ్ళీ వెనక్కి తిరిగి నవ్వింది రెండు చేతులూ చాచింది. ఆ చాచిన చేతుల్లోకి వెనుకనున్న మగవాడు లిప్తపాటులో వచ్చి వాలిపోయి, అచ్చు ఇంగ్లీషు సినిమా లాంటి సెన్సార్ కాని ఎంగిలి ముద్దు పెట్టుకున్నాడు.

మల్లయ్య నోట్లోని నాలిక పెదవుల్ని జీల్చుకుంటూ బయటకొచ్చి ఆత్రంగా ఆశగా రెండు పెదవుల్నీ తట్టి తడిచేసి, ఆనక గుటక లేస్తూ లోపలికి పోయింది మల్లయ్య హుషారెక్కువ అవడంతో రక్తం కాళ్ళల్లోకి పరుగులు తీసి గుండెకు పని కల్పించింది. నెక్స్టు సీన్ కోసం కళ్లు పెద్దవి చేశాడు గాని పైన లైటారిపోయింది రాత్రంతా జాగరం చేశాడు నిద్రరాక, ఊపిరాడక.

ఉదయమే కిటికీవేపు చూశాడు ఎవరూ కనిపించలేదు. ఏమీ వినిపించలేదు తొమ్మిదిన్నర వరకూ పిచ్చెక్కినట్టు చూశాడు—ఫ్లోరసెంట్ లైట్ వెలుతుర్లో కాకుండా నేచురల్ లైట్‌లో ఆమె ముఖం చూడాలని! ఆమె చాలా చాలా చాలా అందగత్తె అయివుండాలి. శ్రీరామచంద్రుడు నాడో వంచిన హరివిల్లు లాంటి వాతెరా, అంజన రేఖతో విలసిల్లే వాల్గనులూ, కొంటెగా వెక్కిరించే కొనదేరిన నాసిక, ఇవిగాక ఒక్క సెకన్లో కనిపించి మాయమైన వక్షస్థలి—మల్లయ్య మరీ మరీ తలచుకుని ఏడ్చాడు. అలాంటి సౌందర్య రాశిని పెళ్ళాడిన పురుషుడి జన్మ చరితార్థం కదా అనుకున్నాడు ఈ మధ్య హైదరాబాద్ అమ్మాయిల పాపిడి కాస్త కుడివేపుకి జరిగిపోతోంది. కాని ఈ కమలాంగి మధ్య పాపిడి తీసి రెండు జడలు వేసింది. అందువల్ల బహుశః ఈమె హైదరాబాద్ హోమాంగి కాదేమో అనుకుని... అంతే అనుకుని వూరుకున్నాడు.

ఒకనాడు మల్లయ్యకు ఇంటిదగ్గర నుంచి తల్లి వుత్తరంరాసింది.'ఇంకెంత కాలం అలా ఒంటరిగా వుంటావురా నాయనా! నీకు పెళ్ళిచేసే రక్తమవి అంతా ఘట్టిగా పట్టుబడుతున్నాయి ఇహ లాభం లేదు పెళ్ళిచేసుకోరా' అని రాసింది

ఆ వుత్తరం వెనకాలే మల్లయ్య తమ్ముడు రాసిన మరో ఉత్తరం కూడా వచ్చింది 'ఒరే అన్నయ్యా—మల్లన్నా! నా మాట విన్నా: చిన్నాణ్ణో పెద్దాణ్ణో చెబుతున్నాను, పెళ్లాడేసెయ్ మా కాకా బోయే వదినగార్ని కూడా చూసొచ్చేశాం. మన దొడ్లో కాసే మల్లెపూవులా

ఎంచక్కా వుందిరా. హైదరాబాద్ అమ్మాయిల్లా కుడిపాపిడి తీయదు. గుంటూరు అమ్మాయిల్లా రెండు జళ్ళేసుకుంటుంది. పి.యు సి. చదువు తోంది. పేరు అరుణ. నువ్వీ సంబంధానికి ఒప్పుకోకపోతే స్వర్గంలో ఇంద్రుడు మహా డేంజరస్ మనిషి అం' అని రాశాడు.

మల్లయ్యకు నోరూరింది ఆ ఉత్తరాన్ని గబగబ మేడమీదికి తీసుకెళ్ళి మాధవీలతతో "మాధవ్వాదినా! నా కాబోయే భార్య అచ్చు నీలా వుంటుందట. మధ్య పాపిడీ అదీ, రెండు జళ్ళూ అవీ, మల్లెపూలూ అవీ—చాలా బావుంటుందని రాశారు. పెళ్ళాడతాను. ఏవంటావ్ ?" అనాలనుకున్నాడు.

ఈ మధ్యలో మళ్ళా రాత్రిళ్ళు రోజూ – అడపా దడపా—మల్లయ్య చూపించిందే చూపించిన తెలుగు సినిమా లవ్ సీన్లా కిటికీలోనించి మాధవినీ, మగరాయుణ్ణీ చూసి చూసి తన కాబోయే భార్య అరుణని తలచుకుంటూ గుండెలమీద పుస్తకం పెట్టుకుని నిద్రపోయేవాడు.

మరోనాడు తల్లి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. ఈ నెల కాస్త డబ్బు హెచ్చుపంపించమని రాసింది. హుషార్లో మాధవిని తలచుకొంటూ, అరుణను వూహించుకొంటూ జీతం అందగానే వంద రూపాయలు ఎం. ఓ. తల్లికి పంపించాడు. మర్నాడు అద్దెల వసూల్రాయుడొచ్చి అద్దె అడిగితే 'ఈ నెల కాస్త పనిపడింది. మాధవీలతగారితో చెప్పు' అన్చెప్పాడు

అన్చెప్పినట్టే ఆ అద్దెల వసూల్రాయుడు మాధవితో చెప్పాడు. చెప్పగానే మాధవి మండిపడి పిల్చుకురా అంది.

వాడెళ్ళి మల్లయ్యను పిల్చుకొచ్చాడు.

'ఏవంయ్యా?' అంది ఇంగ్లీషులో. (ఏవంయ్యా అని ఇంగ్లీషులో ఎలా అంటారో మల్లయ్యకు తెలీదు. బహుశః 'వాట్ ఫాదర్?' అనుండొచ్చనుకున్నాడేమో) అలా ఆమె 'వాట్ ఫాదర్' అనడంతో మల్లయ్య మెల్లగా రీజన్ చెప్పబోయాడు. చెబుతూ ఓ క్షణం ఆగి ఆమెను పైనించి కిందకి ఓ సారి చూసేశాడు. మధ్యపాపిడి అనుకున్నాడుగాని కుడిపాపిడే. అయితే హైదరాబాద్ అమ్మాయే అనుకున్నాడు. అప్పుడామె పౌడరు రాసుకొని వుంది. ఆ దేం పౌడరయి వుండనోపు అనుకుంటూ "అవునండీ" అన్నాడు. అంటంతో మాధవి మంటలా మండిపడింది. పడి, రేపు యిల్లు ఖాళీచేసి పొమ్మంది. ఇల్లు ఖాళీ చేసేస్తే ఏమైపోవాలి, అని అమ్మబాబో అనుకుంటూ 'అదేవింటీ మాధవ్వాదినా!' అనాలనుకొని అన్లేక 'సరే రేపు ఎలా అయినా యిచ్చేస్తాను సాబ్!' అనుకొంటూ (అవిడ సెక్స్ ఫెయిర్ సెక్స్ అని

మరచిపోయి, సెక్స్ మార్చేసి సార్ అన్నందుకు తర్వాత సిగ్గుపడ్డాడు.) మెడదిగిపోయాడు.

ముందు మాధవి అందంగురించి ఆలోచించాడు అన్ని తిట్లూ తిని. అవిణ్ని చిదిమి దీపం పెట్టుకోవచ్చు. చిన్నముక్క తన ముక్కుక తగిలించుకోవచ్చు. (కాకి ముక్కుకి దొండ పండు నానుడి) నలిపి జేబులో పెట్టుకోవచ్చు. లేదా ఆమె అందం తాలూకు లైసెన్స్ లాగేసి వంటికి పులుముకొని ఆఘ్రాణిస్తే? కాని... కాని ఆ అందం వెనుక అలాంటి ఆగ్రహం వుండేవిటి చెప్మా? రేపు ... అరుణ కూడా ఇలా ఒక ... చేస్తే 'వాట్ ...?' అని మీద అల్సేషియన్లా పడుతుందా? (అసలు అరుణకు తనెందుకు అద్దెవ్వాలి అని మల్లయ్య ఆ క్షణంలో అనుకోలేదు. కారణం: అరుణనీ మాధవినీ అతను కలగా పులగంగా ఆలోచిస్తున్నాడు) ఆవిడ నిజంగా తనమీద పడితే భరించి యిప్పట్లా వూరుకోగలడా? భరింపబడే భార్యకింత కండ కావరమా అని పెద్ద పద్యం పాడడూ సినిమాలో లాగ!

మర్నాడు తల తాకట్టుపెట్టి డబ్బు అప్పతీసుకు రావాలని తలని చేతిలో పట్టుకుని వూరంతా తిరిగాడు. తల ఎవరూ తాకట్టుపెట్టుకోమంటే, మొత్తం తననే తాకట్టు పెట్టేసి, అద్దెల వసూల్రాయుడి ముఖం మీద కొట్టాడు కొత్తా



అను కున్నాడు. మాధవీలతాదేవి అంత శ్రీమంతురాలు కదా, ముప్పై రూపాయల కోసం ముఖం చూసుకుని మగాడి ముఖం మీద అంతలేసి మాట లెందుకందా అనుకున్నాడు. పోనీ నువ్వన్నా అలా కసురుకోకు అరుణా! గౌరవం పోతుంది నీ మీద అనుకున్నాడు. అరుణను తలచుకోగానే గప్పున మాధవి కళ్ళముందు కనిపించింది. సరే ఆ ముఖమే అరుణదని అనుకొని గాల్లోనే 'యూ సిల్లీ స్వీట్ హార్ట్' అంటూ ముద్దు పెట్టుకున్నాడు.

మరునాటి రాత్రి మాధవి కిటికీలో యిచ్చే ఫ్రీవ్యూ ఏంగిల్ అఫ్ ఎలివేషన్ కాస్త ముందుకి జరిగి త్రిగొనమెట్రీలో సైన్ థీటా అయింది. అది మొదలు మళ్ళా మల్లయ్య గుండెల్లో ఎల్ బై టి స్క్వేర్ ఈజ్ ఈక్వల్ టు కాన్‌స్టెంట్ అయి లోలకం మాదిరి అయింది.

మల్లయ్య ప్రమోషను నొస్తాయని బి.కాం. పరీక్షలకు కట్టాడు. పరీక్షలు దగ్గరకి రావటంవల్ల స్టడీస్ కాస్త విగరస్‌గా మొదలు పెట్టాడు. ద్వారానికి అడ్డంగా చాప వేసుకుని, తలవేపున కరెంట్ కట్ వల్ల పదిహేను వాట్లు బల్బును మాత్రం పెట్టుకుని పుస్తకాలతో కుస్తీ పడుతున్నాడు. ఉండీ ఉడిగీ కాస్త కళ్ళు ముప్పై అయిదు డిగ్రీలు తిప్పితే కిటికీలోనించి సైడ్ ఎలివేషన్ కనిపిస్తుంది. కాని కిటికీ లోపల ఎవరూ కనిపించక పోవడం మల్లయ్యకు బాధగానే వుండేది.

ఒకనాడు సరిగ్గా పన్నెండు గంటలకు అనవాయితీగా లైట్లు ఆరిపోయాయి. మల్లయ్య కొవ్వొత్తి వెలిగించి మరి కాస్సేపు చదువుకొని చదువెత్తి పెట్టేస్తున్నాడు. అంతలో పైనించి పిలుపు వినిపించింది. అటు వేపు చూశాడు. కిటికీ దగ్గర తెల్లని ఆకారం కనిపించింది. బహుశః మాధవి దేమో!

'నేనాండీ?' అన్నాడు.

'ఆఁ ... ఒకసారి ఆ కొవ్వొత్తి యిలా తీసుకు వస్తావా?' తియ్యని మాటలు వినిపించాయి.

దులుపుకొని ముఖం తుడుచుకొని తల మరోసారి దువ్వుకుని, అద్దం చూసుకొని కొవ్వొత్తి తీసుకొని పైకి వెళ్ళాడు.

'అదక్కడ పెట్టు. థాంక్స్! సమయానికి లైట్లు పోయాయి' మాధవి అంది ముద్దు ముద్దు తెలుగులో.

మల్లయ్య కొవ్వొత్తి టేబుల్ మీద పెట్టాడు టేబుల్ మీద రెండు సీసాలున్నాయి ఒక గ్లాసుకి సగానికి ఏదో రంగుద్రవం వుంది. వంగగానే అదోలా వాసనకొట్టింది. బ్రాందీలా వుంది; బహుశః అవిడ భర్తగారు సేవిస్తున్నారేమో అనుకున్నాడు

"అబ్బ! ఆ గ్లాసిలా అం దు
ంటావా?" అంది మాధవి పెరుపు
ాద వళ్ళు విరుచుకుంటూ.

"ఏం గ్లాసండి?"

"అదేనయ్యా టేబుల్ మీదుంది"

గ్లాసు తీసుకెళ్ళి ఆమె కిచ్చాడు
మె గడగడ తాగేసింది మల్లయ్య
డదడ వణికిపోయాడు. ఏమిటి!
డవాళ్ళు తాగుతారా? అది
ంగా డెదురుగా? ఇంగ్లీషు సినిమా
[illegible] ముక్కలే కాకుండా వాళ్ళల్లా
[illegible] వ్యవహారాలు కూడానా!

"నీ పే రేమిటయ్యా?"

"మల్లయ్య అంటారండి"

"ఎవరంటారండి?"

"మా వాళ్ళండి.

"అంటే, మీ ఆవిడ కూడానా?"

"నా కింకా పెళ్ళి కాలేదండి"

"పూర్ క్రీచర్! పెళ్ళి కాకుండా
బ్రతికేస్తున్నావా?"

ఆవిడ సానుభూతి ప్రశ్న అర్థం
కాక తెల్లగా తెల్లమొహం వేశాడు
నల్లని మల్లయ్య దేభ్యంలా నిలబడి
చూస్తున్న మల్లయ్య దగ్గర కొచ్చిం
దావిడ

"రాకెన్ రోల్ నీ కిష్టమేనా?"

తలూపాడు ఏమన్లేక

ఆమె వెళ్ళి అలమారాలోనించి
ట్రాన్సిస్టర్ టేప్ రికార్డరు తీసింది.
ఆన్ చేసింది

---

* కొత్త తెలుగుమాష్టారు పాఠం చెబుతున్నాడు బోరుకొట్టి ఒకొ్కక్కళ్ళూ జారుకుంటున్నారు. చివరికి ఒక కుర్రాడుమాత్రం మిగిలాడు. మేష్టరు, ఆ కుర్రాణ్ణి మెచ్చుకుని "నువ్వు తప్పకుండా మినిష్టరువవుతావు..." అంటూ మొదలెట్టాడు
"నేనూ పోదునుగాని మీ చేతిలో పుస్తకం నాది" అన్నాడు.

* "కారంలో కూర ఎక్కువయింది" అన్నాడు మొగుడు పరాగ్గా.
"అక్కడికీ ఎక్కువే వేశాను సుమాండి" అంది పెళ్లాం చిరాగ్గా.

డాన్స్ చెయ్యగలవా ఆ?

రాదండి.

నేర్పుతా రా అని చెయ్యి పట్టుకుంది అడుగు వేయమంది వేశాడు నిషాతో ఆవిడ అడుగులు తడబడుతూంటే ఖుషీ తో అతని హృదయం లయ తప్పింది మొదట భయంతో ముచ్చెమటలు పోశాయి

ఏవండీ? అన్నాడు

ఉఁ?

గప్పున లైట్లు వచ్చేస్తేనో?

రావు ఇలాంటి సమయాలు ఎలాంటివో ఎలక్ట్రిసిటీ బోర్డువారికి తెలుసునే!

కాసేపు గెంతారు మల్లయ్యకు హుషారొచ్చింది చేతుల్లో సన్నని ఉల్లాభాల్లో మల్లెపూవులాంటి మదాలస ఊహించలేని స్వర్గం హృదయం మీద పరవళ్ళు తొక్కుతోంది కలలో కూడా అనుకోని కౌగిలి కరిగిపోయాడు

మీ శ్రీవారు లేరా?

లేదు

ఏకవచన ప్రయోగానికి ఝుడుసుకున్నాడు

"ఎక్కడికెళ్ళారు?"

"ఏట్లోకి."

"పాపం!"

"జాలిచూపించకు. వొర్రి ఇడియట్. వారమయింది. ఎక్కడికో పోయాడు. బహుశః రాక్ కాసిల్ లోనో, రిట్జ్ లోనో దొర్లుతూ వుంటాడు. నువ్వే చెప్పు మలాయ్! నాకు మాత్రం డాన్స్ చెయ్యాలనీ, సరదాగా తిరగాలనీ, సినిమాలు చూడాలనీ వుండమూ? కట్టుకున్న మొగుడు కొంపలో వుండకపోతే నేనెలా చావను? ఒకటా రెండా — పదేళ్ళ నుంచీ ఇదే తంతు. నన్ను ఈ లంకంత కొంపలో వదిలేసి తను వానా తిరుగుళ్ళూ తిరుగుతాడు పోనీ వచ్చిన్నాడయినా సరిగా వుంటాడా అంటే వేట్ సిక్స్టీనైన్ మస్తుగా తాగి మూలగదిలో మూలుగుతాడు. ఎప్పుడన్నా కోపం వచ్చి గట్టిగా అంటే నన్నూ వేట్ సిక్స్టీనైన్ తాగమంటాడు ఫూల్. తాగితే, పోయిన పేరడైస్ వస్తుందా?"

టేప్ పూర్తయి సంగీతం ఆగింది.

"మర్నేనిక ఆడలేను. మత్తుగా వుంది. నిద్రపోతా."

"సరే"

ఆమె పక్క మీద వాలిపోయింది.

"ఇంత రాత్రప్పుడు కిందికేం వెళతావ్? ఇక్కడే పడుకోకూడదా మలాయ్?"





"ఎక్కడ పడుకోవాలి ? రెండో బెడ్ అయినా లేదే !" అన్నాడు మల్లయ్య, కాస్త హుషారుగానే.

"పిచ్చివాడా! రెండో బెడ్ ఎందుకోయ్. ఇక్కడే పడుకో" అని చేతులు పట్టుకుని లాగింది.

ఏ లోకంలో వున్నాడో, ఏం చేస్తున్నాడో వూహించుకోలేని అనుభూతులు మల్లయ్యను చుట్టుముట్టి వూపిరి సలపనివ్వకుండా మూడు గంటలు ఎక్కడికో తీసుకుపోయాయి అంతలోనే జాలిలేని కోడి తొలిఝాము కూత కూసింది. మల్లయ్య కంగారు పడుతూ లేచిపోయాడు. బట్టలు వేసుకుంటూ స్పృహలేని ఆ సుకుమారిని వెయ్యోసారి ముద్దు పెట్టుకుని విడవలేక విడవలేక గుడికి వెళ్ళిపోయాడు.

తన గుహలోకి వెళ్ళిన చాలసేపటికి గాని అతను తేరుకోలేకపోయాడు. తేరుకున్నాక భయం, వణుకు, అసహ్యం పుట్టుకొచ్చాయి. అంత శ్రీమంతురాలు, అంత అందకత్తె తనను కాంక్షించడమేమిటను కొని కాసేపు ఆశ్చర్యపోయాడు. ఆ కాసేపు అసహ్యించుకున్నాడు.

రేపు తను పెళ్ళి చేసుకోబోయే రెండుజడల అరుణకూడా ఆగి తను లేని సమయంలో యిలా పర పురుషుణ్ణి తన సొంతం చేసేసుకుంటే తను భరించగలడా ? ఈ ఘటన మాధవి భర్తకు తెలీదు గాబట్టి ఆమె నతడు మహా పతివ్రతగానే భావించుకుంటూంటాడు. తనకి కూడా అరుణ జీవిత రహస్యాలు తెలీకపోతే అరుణని మహా పత్రివ్రతం గానే వూహించుకొంటాడు. తెలిసిన మరుక్షణం ఏం చేస్తాడు ? చంపేస్తాడు. వాడి రక్తం తాగుతాడు. మాధవి మొగుడికి తన గురించి తెలిసిపోతే అతను కూడా తన రక్తం తాగవచ్చుగా ? ఇంత బ్రతుకూ బ్రతికి చివరికి యిలాంటి చావు చావాలా ? ఇంకా తనకి ఎంత జీవిత ముంది ? అరుణతో కాపరం పెట్టాలి. పిల్లల్ని కనాలి. అలా అలా ఏవో ఏవో లోకాలకి పోవాలి. ఇంత కార్యక్రమం వుండగా అర్థాంతరంగా చావడమేమిటి ? చావకూడదు అనుకున్నాడు. అయితే ఏమిటి వుపాయం ? అక్కణ్ణుంచి మకాం మార్చేసేనో ? దిక్కుమాలిన వూళ్ళో కావాలనుకున్నప్పుడు అన్నీ కొంపలు దొరికి చావవు కదా ?

మళ్ళీ ఆలోచించాడు : మాధవి తన నెందుకు కాంక్షించింది ? తను అందగాడు కాదే ! పెద్ద హోదా, డబ్బు, ఉద్యోగం లేవే ! గొప్ప మేధావీ, ఢ్వంచరన్ లైఫ్ కాదే ! మరి తనలో ఏమిటి చూసి పిలిచింది ? తన భర్త తనని అలక్ష్యం చేస్తున్నాడనే కసివల్ల పిలిచిందా ? దేహంలో దాహం తీరకపోతే ప్రతి ఆడదీ యిలానే తెగిస్తుందా ? (అరుణని తను పెళ్ళయాక చచ్చినా విడిచిపెట్టి వుండకూడదు)

మళ్ళీ అనుమానించాడు. ఒక వాడు యిలా తనని పిలచిన మాధవి యిహనుంచి రోజూ యిలానే పిలుస్తూ వుంటుందా ?

"వద్దు వద్దు వద్దు" అని గట్టిగా పదిసార్లు అనుకుని చీకటి పడ్డు తూండగా అనుకున్నాడు : ఇవాళ కూడా లైట్లు ఆరిపోయి, ఆమె పిలుస్తే ఎంతబావుణ్ణు అనుకున్నాడు మెల్లగా. ఛ! పిలవకూడదు. ఛ! ఛ! పిలవాలి పిలవాలి. ఛ ఛ ఛ! పిల చినా వెళ్ళకూడదు ... వెళ్ళాలి! వెళ్ళాలి! వెళ్ళాలి!

కాని ఆ రాత్రి లైట్లు ఆరనూ లేదు. ఆమె పిలవనూ లేదు. కాని ఏవో మాటలు, మగ గొంతుక విని పించాయి. మళ్ళీ మల్లయ్య కు మాత్రం రాత్రంతా జాగరణయింది. తిట్టుకున్నాడు. మరి కాసేపు ఉడు క్కున్నాడు

ఎప్పుడో తెలతెల వారుతున్న ప్పుడు నిద్రపట్టింది. మెలుకువ వచ్చే సరికి తొమ్మిదయింది. గబగబ స్నానం గట్రా చేసి గుడ్డలు వేసు కుని ఆఫీసుకి బయులుదేరాడు. బయలుదేరుతూ వుండగా మాధవి నౌకరు ఎదురై "అమ్మగారు మిమ్మల్ని పిలుస్తున్నారు సార్" అని కబుర్చెప్పాడు. "ఛ! నేనానుఫో" అనాలనుకొని అన్లేక "అన్నట్టు రాత్రి అయ్యగారు వచ్చారు లేవిట్రా?" అన్నాడు. వాడు రాలే దన్నాడు. అయితే రాత్రి వినిపించిన మగగొంతు? ఎంతైనా అసహ్యం వేసింది. కోపం వచ్చింది వెళ్ళ గూడ దనుకుంటూనే వెనక్కి తిరి గాడు. తిరుగుతూ అనుకున్నాడు "పోన్లే! ఈవేళ ఒక్క రోజూ షార్ట్ లీవ్ పెట్టేస్తా" అని

మాధవి గదిలోకి వెళ్ళాడు. గదిలో మాధవి లేదు వెళ్ళి పరుపు మీద కూర్చున్నాడు షర్ట్ బటన్ ఒకటి విప్పి ఫేన్ ఆన్ చేశాడు మాధవి వచ్చేసరికి మాధవుళ్ళా పడు కొని పోజు పెట్టాలనుకున్నాడు.

అంతలోనే మాధవి బాత్ రూమ్‌లోనించి వచ్చింది. ఈ ఇంటి స్నానం చేసినట్టుంది. బలే ముద్దుగా వుంది. వంటిమీద సన్నని నైలాన్ గౌను పాదాలవరకూ వుంది. టర్కిష్ టువల్ ఒక భుజంమీద వుంది. కళ్ళు బాగా ఎర్రగా వున్నాయి రాత్రి బాగా వేట్ సిక్స్టీనైన్ పట్టేసి వుంటుంది ఇంకా గీర వదల్లేదను కున్నాడు. నవ్వుకుంటూ లేచి ఆమె ఎదురుగా వెళ్ళాడు. "ఎంత అందముగా వుంటివి మాధవీ" అని అమాంతంగా కౌగ లించుకోవాలని దగ్గరగా వెళ్ళాడు. అంతే! చెంప ఛెళ్ళుమంది మల్లయ్య నోరు మాయల ఫకీరుండే గుహలా తెరుచుకుపోయింది అందులో మంటలు లేవు. మంచు గడ్డలా గడ్డ కట్టుకుపోయాడు. ఆమె వెళ్ళి చప్పున తలుపులు వేసేసింది. టేబుల్ మీద నున్న హంటర్ తీసు

కుంది. గొడ్డుని బాధిస్తున్నట్లు గొడ్డులా బాదింది. గొడ్డు అయితే బాధకి అరిచి వుండేది. కాని ఈ మాట లొచ్చిన గొడ్డు మొత్తుకున్న 'చస్తున్నాను తల్లీ' అనన్నా అనలేక పోయింది అతనికి అంతర్జాతీయ భాష, రాష్ట్ర భాష, మాతృభాషలు తెలుసు అయినా ఆ క్షణాన అన్నీ సమ్మె చేశాయి. కానీ అది మానవుడు అరచినట్లు అరవాలనుకున్నాడు కాని బయటవున్న సర్వెంట్లు వొచ్చి ఎముక లేరేస్తారని భయం అరవ లేక, బాధకి తాళలేక కిందపడి దొర్లాడు బాధ ... యిహ ఓపిక లేక హంటర్ కింద పారేసి,

'యూ ఇడియట్, స్కౌండ్రల్, స్వయిన్, డర్టీ డాగ్' అనుకుంటూ సోఫాలో కూలబడింది

అసలింతకూ ఆ అంగన తనని ఎందుకలా బాదిందో మల్లయ్యకు అర్థం కాలేదు. నిన్నరాత్రి తనేగా వెళ్ళింది? తన తప్పేముంది? నిషా దిగాక అసలు విషయం గుర్తించి తన పాతివ్రత్యం మంట్లో గలిసి పోయిందని కసెత్తి పోయిందా? అలా అయితే రాత్రి వచ్చిన్నవాడు?

అలా యేడుస్తూ ఆలోచిస్తూ నేలమీద అతనూ, క్రోధంతో నిలువెల్లా వణికిపోతూ సోఫా మీద ఆమే చాలాసేపు సైలెంట్ పిక్చర్లయ్యారు. తర్వాత ముందుగా తేరుకున్న దావిడే!

'లే, బుద్ధిగా మసలుకో ఇలాంటి పొరపాటెప్పుడూ చేయకు' అని లేచిపోతూ తువాల్తో ముఖం తుడుచుకుంది.

నా పొరపాటేమిటండీ అనాలని అనలేక కుంటుతూ లేచి నిలబడ్డాడు

'ఆ అడుక్కుతినేవాడి అండర్వేర్ తీసుకుపో' అంది.

మల్లయ్య చుట్టూ చూశాడు మంచం కింద నిన్నరాత్రి పొరపాటున వదిలేసిన అరవయ్యో నెంబర్ ముతకగుడ్డ అండర్వేర్ ముఖం చాటేసుకుని నవ్వింది జాలిగా!

యూఫోమ్ మేట్రెస్ స్ప్రింగ్ మంచం అందర నైలాన్ అండర్వేర్ వుండాలిగాని ఇలాంటి చవక ముతక గుడ్డలు వదిలేస్తుంటే ఇక్కడి లక్షాధికారులు చూస్తూ పోతూ ఊరుకోరు పొరపాటు ఎవరిదో?' అనాలనుకున్న అండర్వేర్ భాషరాక వూరుకుంది.

మల్లయ్య దాన్ని తీసుకుని బయటకు అడుగులు వేశాడు 'వేట్ సిక్స్టీ సెవెన్' నిషా యిప్పుడు అతన్లో వచ్చింది వళ్ళంతా తేలికై తూలి పోయి ... కాళ్ళు కదపలేక తూలి జారి పడిపోయాడు మెట్లమీద. జారిపోతూ ఏడ్చాడు.

'మాధవారుణా! భర్తను హింసించావ్! నిన్ను భగవంతుడు క్షమించడు సుమా!'

***



ఫైల్స్
రికార్డ్స్
రూం




లలితా... నీకు జ్ఞాపకముందా- అందంగా నాజూగ్గా, సన్నగా ఉంటుంది. మా ఫ్రెండ్... ఇందిర, ఈవేళ సాయంకాలం, వాళ్ళింటికి...




ఈవేళ రాలేనండీ, మా ఆవిడకి ఒంట్లో బాగాలేదు

[గత సంచిక తరువాయి]

## 18

చిన్నకారొకటి సర్రున దూసుకు పోయింది రోడ్డుమీది దుమ్మంతా గాలితోపాటు సుళ్ళు తిరుగుతూ పైకి లేచి నడుస్తున్న అతని ముఖాన్ని స్పృశించింది

శంకరం కర్చీఫ్‌తో ముఖం తుడుచుకున్నాడు అంత దురుసుగా వెళ్ళే ఆ కారెవరిదో తెలుసుకోవాలనిపించిందతనికి ఇంతలో కారు కనుమరుగైంది శంకరానికి గణపతి గుర్తుకొచ్చాడు ఏ నెంబరు కారు ఎవరిదో, అందులో ఎవరు తిరుగుతూ వుంటారో తడుముకోకుండా చెప్తాడతను — వాళ్ళ పూరి భోగట్టాకు సంబంధించినంత వరకూ అందమైన అమ్మాయిలు తిరిగే కారు నెంబర్లు నిద్రలో కూడా కలవరిస్తాడు

ఆలోచిస్తూ నడుస్తున్న శంకరం తన ప్రక్కగా ఒక కారు ఆగటం గమనించనే లేదు, అందులోని ఒక వ్యక్తి తనను "హల్లో శంకరం గారూ" అనేవరకూ

మాలతిని చూసి నిర్ఘాంత పోయాడు శంకరం సి ఐ డి కి దొటికిన దొంగలా ఫీలయ్యాడు, ఆ క్షణంలో. ఏం మాట్లాడాలో తోచ లేదు




**విహారి & శాలివాహన**

"ఏం మహానుభావా ? అడ్రస్ ఇచ్చినా మా యిల్లు కనుక్కోలేక పోయారా, లేక అడ్రస్ ఎక్కడైనా పారేసుకున్నారా?" అన్నది మాలతి నవ్వుతూ

శంకరం నవ్వాలని ప్రయత్నించాడు

"మీకోసం ఆ బట్టల కొట్టుకు ఎన్నిసార్లు వెళ్లానో తెలుసా ?"

ఎన్నోసార్లు వస్తుందని తెలిసే తను అక్కణ్ణుంచి తప్పుకున్నాడు. తనను గురించినవిషయు సేకరణ చేసే వుంటుంది ! — 'ఇక దాచి మాత్రం ప్రయోజన మేఁవిటి?' అనిపించింది శంకరానికి అయినా తప్పును కప్పి పుచ్చుకుంటూ, "సారీ ఈ మధ్య ఒంట్లో బాగుండటం లేదు అందు కని రాలేకపోయాను" అన్నాడు

అపత్కాలంలో అబద్ధంకంటే పత్వరమైన గుణాన్నిచ్చే మందు మరొకటి లేదు!

"రండి, మా యింటికి వెళ్దాం. చాలం రోజులనుంచీ మీ కోసం ఈ గుంటూరులో తిరగని వీధి లేదు." అంది నిష్టూరంగా.

"ఇప్పుడెందుకు లెండి తర్వాత వస్తాను." శంకరం మొహం అదోలా పెట్టి అన్నాడు.

"అదేమీ కుదరదు. మీరురానిది నేను కదలను. రండి" అంది కారు వైపు నడుస్తూ.

బఁయ్‌మనే హారన్ మ్రోతతో కారు కదిలింది.

శంకరాన్ని తన స్నేహితురాలి భర్తగా తల్లిదండ్రులకు పరిచయం చేసింది మాలతి.

కుశల ప్రశ్నలయ్యాక, "మీరిక్కడేం చేస్తున్నారు?" అని అడిగారు రమాపతిగారు.

శంకరానికి పచ్చి వెలక్కాయ గొంతున పడ్డట్లయింది. యథార్థం చెప్పుకునే ధైర్యం లేకపోయింది. జవాబేం చెప్పాలా అని ఆలోచిస్తున్న సమయంలో మాలతి అందుకుంది.

"రండి మాష్టారూ; నా లైబ్రరీ చూద్దురుగాని."

శంకరం మనస్సులోనే ఆమెకు ధన్యవాదాలు తెలుపుకుని ఆమె వెంట లోపలికి నడిచేడు.

మాలతి మేడమీద తన గదికి దారి తీసింది. ఆ గదిలో నాలుగు కుర్చీలు, టేబులు, టేబుల్ లైట్, టేబుల్ ఫాన్ మొదలైన హంగులన్నీ వున్నాయి. రెండు అద్దాల బీరువాలనిండా ఆధునిక సాహిత్యంలో ప్రఖ్యాతి గడించిన రచనలెన్నో వున్నాయి. అవేగాక ప్రముఖ పత్రికలలో సీరియల్స్‌గా ప్రచురితమైన నవలలు, ముఖ్యమైన వ్యాసాలు బైండ్ చేయించబడి అందంగా అమర్చబడి వున్నాయి. టేబుల్‌పైన కొన్ని కాగితాలు పేపర్ వెయిట్ భారానికి అణగి వున్నాయి.

"మీరు కథలు వ్రాస్తారా?" శంకరం అడిగాడు.

మాలతి అందంగా నవ్వింది. "ఏదో అప్పుడప్పుడూ."

"అయ్యబాబోయ్"

"ఏవిఁటలా అన్నారు?"

"మీరుకూడా మగవాళ్లమీద దుమ్మెత్తి పోస్తారా?"

"ఎందుకు?"

'ఎందుకేఁవిటి? ఈ రోజుల్లో జరుగుతున్నది అదేగా. తానొక పెద్ద రచయిత్రినంటూ బయలుదేటి, అనుభవంలేని జీవిత రహస్యాలను సూత్రీకరిస్తూ, మగజాతి నంతనూ

దుయ్యబట్టడమేగా. ప్రచురింపబడిన ఆ రచనల్ని చదివి, మగవారి మాయల్ని, వారిలోని కుళ్ళును, మోసాన్ని, క్రౌర్యాన్నీ రచయిత్రిగారు చక్కగా చిత్రీకరించారంటూ పాఠకులు పొగడటం – ఇదేగా జరుగుతున్నది."

మాలతి నవ్వేసింది. ఎదురు చెప్పలేదు. ఆ విధంగానైనా అతనిలోని అభిప్రాయాలు బహిర్గతం కావటం, అతనికీ అతని తోటివారికీ ఎంతో శ్రేయస్కర మనుకొంది.

అందుకనే అతన్ని ప్రోత్సహించే ధోరణిలో అంది, "మీరూ రాయండి– ఆడవాళ్ళమీద."

"అంత అదృష్టం వుంటే యింకా లేనిదేముంది ?"

"రాయలేరా ?"

"రాయలేనని కాదు. ఆడవాళ్లని దేవ భామినులుగా చిత్రించలేను. నిసర్గ సత్యాన్ని చెప్తున్నా, యాంటీ సెంటిమెంట్ అనీ, భారత నారి ఆ విధంగా ఎన్నటికీ చేయదోయ్ చవటా అని ఆ రచనల్ని బుట్టలరావు కాజేస్తాడు."

మాలతి సన్నగా నవ్వుతూ లేచి టేబుల్ పై నున్న ఫ్లాస్క్ లో కాఫీని కప్పులో పోసి, "కాఫీ త్రాగండి. అలసి పోయారు" అంది.

"మీ కెంత ఎగతాళిగావున్నా



నా నిశ్చితాభిప్రాయం అదే" అన్నాడు శంకరం కాఫీ కప్పును తీసుకుంటూ.

ఆ తర్వాత సంభాషణ అట్టేసేపు సాగలేదు. వెళ్తానంటూ లేచాడు శంకరం. "ఎక్కడికి వెళ్తారు, ఇక్కడే వుండిపోరాదూ ?" అంది నవ్వుతూ.

"ఇది మరీ బాగుంది"

"పోనీ ప్రతిరోజూ యిలాగే ఓసారి వచ్చిపోతూ వుండండి."

"అలాగే".

"అలాగే అంటే కుదరదు. ప్రామిస్ చేయండి" అంది మాలతి.

క్షణం అనుమానించి "ప్రామిస్" అన్నాడు శంకరం మృదువుగా.

## 19

వేణుమాధవ్ చెప్పినదంతా విన్న రఘు, సౌభాగ్యమ్మా, లక్ష్మి చాలా కలవరపడ్డారు. రేణుక పరిస్థితుల్ని పూర్తిగా చెప్పాడు వేణుమాధవ్.

శంకరం అంత మూర్ఖంగా ప్రవర్తించి రేణుక మనస్సును బాధించాడని తెలుసుకున్న రఘుకు శంకరమంటే వున్న సదభిప్రాయం సన్నగిల్లింది.

సౌభాగ్యమ్మ సరేసరి. కూతురికి గొప్ప ప్రమాదం సంభవించినట్లే విలవిలలాడి పోయింది. అయినా, రేణుక స్వభావం తెలిసిన దవటం వలన తప్పు ఆమెదే అయివుంటుందన్నది.

వేణుమాధవ్ అన్నాడు, "మీరను కోవటమేగాని, మీ అమ్మాయిలో ఎంతమార్పు వచ్చిందో మీకు తెలీదు. ఆమె ఇదివరకటి రేణుక కాదిప్పుడు. మాటల్లో, ప్రవర్తనలో ఎంతో తేడా వుంది."

"వదిన్ని రమ్మని వుత్తరం వ్రాయండి" లక్ష్మి భర్త నుద్దేశించి అన్నది.

"రావటానికేం, వస్తుంది లేవే లక్ష్మి. కానీ ఆ శంకరం ఎక్కడికి పోయినట్లు, ఏం చేస్తున్నట్లు ?" సౌభాగ్యమ్మ అంది.

"అసలు రేణుక ఇక్కడికి రాదవే నా వుద్దేశ్యం. ఈ వూరు వచ్చినప్పట్నుంచీ ఆమెకు మరీ బాధ. కనపడిన ప్రతివాళ్ళూ శంకరాన్ని గురించివ వివరా లడుగుతూ వుంటే దాని హృదయం మరీ వ్యధ చెందుతుంది. అందుకని రేణుకను అక్కడే వుండనీయడం మంచిది. ఆ ఆఫీసులోనన్నా కొంత కాలక్షేప మవుతుంది. ఏఁవంటారు వేణుమాధవ్ గారూ ?" అన్నాడు రఘు.

ఒక్కక్షణం ఆలోచించి చెప్పాడు వేణుమాధవ్. "మీరు చెప్పిందీ నిజమే. పోనీ మీరే వెళ్ళి చూసి రండి."

"మీ రెందుకు ? ఎంత అన్నగ

రయినా, మనస్సువిప్పి మీతో ఏం మాట్లాడుతుంది. అత్తయ్య గారిని పంపితే వదినకు సహాయంగానూ వుంటారు, ధైర్యమూ చెప్తారు." లక్ష్మి సలహా యిచ్చింది.

లక్ష్మి చెప్పినదే బాగున్నదంది సౌభాగ్యమ్మ.

"అయితే మా ఫ్రెండ్‌ని ఎప్పుడు పరీక్ష చేస్తారు, డాక్టర్?" వేణుమాధవ్ విషయాన్ని మారుస్తూ రఘును ప్రశ్నించాడు.

"దానికేముందండీ. మీ యిష్టం. రేపు హాస్పిటల్‌కి తీసుకురండి."

"అతని జీవిత చరిత్రంతా మీ సిస్టర్‌కి చెప్పేశాను. ఇంక అతన్నేంచేసినా మీరు చేయవలసిందే. ఎన్నో ప్రయత్నాలు చేసి విసిగిపోయినా, మీ చెల్లెలు ప్రోద్బలంతో మళ్ళీ నాలో ఆశ కలిగింది. అతన్ని వొప్పించి మీ దగ్గరికి తీసుకొస్తున్నాను."

"ఐషల్‌డూ మై లెవెల్ బెస్ట్" అంటూ లేచాడు రఘు.

వేణుమాధవ్ సెలవు తీసుకున్నాడు.

సౌభాగ్యమ్మ నాగార్జునసాగర్‌కు ప్రయాణమైంది.

# 20

హాస్పిటల్‌లో కాంతారావుని చూసిన రఘు నిర్ఘాంతపోయాడు.

చిన్ననాటి మిత్రుని ఆ దుస్థితిలో చూస్తానని కలలోకూడా వూహించని రఘు హృదయం ద్రవించింది. కాంతాన్ని కౌగలించుకుని విలపించాడు.

జరిగినదంతా వివరించాడు కాంతారావు.

చంద్రయ్య యిల్లు అగ్నిపాలు కావటం, లక్ష్మిని వివాహం చేసుకోవటం — అన్ని విషయాలూ కాంతారావుకు వెల్లడించాడు రఘు.

రఘు మంచిదనానికి కాంతారావు హృదయమంతా కృతజ్ఞతతో నిండిపోయింది.

చంద్రయ్య, లక్ష్మి, వాసు, కాంతారావును చూసి ఆనందం, అతని అంధత్వానికి విచారం పొందేరు.

తను చేసిన తప్పుడు పనికి మన్నించమని అన్నయ్య కాళ్ళమీద పడి క్షమాపణ కోరుకున్నాడు కాంతారావు.

రఘు మాత్రం తన శాయశక్తులా ప్రయత్నించి కాంతారావుకు కళ్ళు తెప్పించాలని నిశ్చయించుకున్నాడు.

మర్నాడే అతనికి ఆపరేషన్ చేయటానికి అవసరమైన ప్రయత్నాలు చేయసాగేడు.

# 21

మూడు నెలలు గడిచాయి.

శంకరం తరచుగా మాలతి దగ్గఱికి వస్తూనే వున్నాడు వారిద్దరి మధ్య స్నేహం దృఢమైంది ఎప్పుడూ సాహిత్యంమీదనో, లోకం తీరుపైనో, జీవిత సమస్యలపైనో ఎడతెరిపి లేకుండా వాదించుకునేవాళ్లు. అప్పుడప్పుడూ రేణుక విషయం కావాలని కదిపేది మాలతి కాని, శంకరం మాట తప్పించేవాడు. ఇక, మాలతి ఆ విషయాన్ని సాగదీసేది కాదు

ఒకటి రెండుసార్లు మాలతి అంది, "శంకరంగారూ, మీకేదైనా డబ్బు అవపరంవస్తే నన్నడగండి మొహమాటపడి ఇబ్బంది పడకండి"

కాని, శంకరం ఆమెను ఎప్పుడూ డబ్బు కావాలనికోరలేదు శంకరానికి ట్యూషన్లమీద డెభై, ఎనభై రూపాయలదాకా వచ్చేవి పొదుపుగా అవసరమైన ఖర్చులు గడుపుకుంటూ వస్తున్నాడు.

ఒకరోజు శంకరం మామూలుగా మాలతి దగ్గఱికి వచ్చాడు

"రండి శంకరంగారూ, మీకోసమే ఎదురు చూస్తున్నాను. మీకీ రోజు

మంచి శుభవార్త చెప్పాలి" అంటూ ఆహ్వానించింది మాలతి

'తనకు మాలతి చెప్పబోయే శుభవార్త ఏమిటా?' అని ఆలోచించాడు శంకరం కొంపదీసి రేణుక ఇక్కడికి రావటం లేదుగద్దా?— అనుకున్నాడు

"మీ సంగతంతా ఫాదర్‌తో చెప్పాను మీరు లోగడచేసిన వ్యాపారం, అందులో మీకున్న అభినివేశం అన్నీ చెప్పాను 'అలాంటివాడు మా ఆఫీస్‌లో ఉద్యోగంలో చేరితే తప్పకుండా పైకి వస్తాడు' అన్నారాయన మీ కిష్ట మైతే రేపే ఉద్యోగంలో చేర వచ్చునట. ఇన్‌స్పెక్టర్ పోస్టొకటి ఖాళీగా వుందిట టెంపరరీదైనా పర్మనెంట్ అయ్యే సూచనలున్నాయిట" అంది.

శంకరం ఆనందానికి అవధులు లేకపోయాయి. తనమీద మాలతి కున్న శ్రద్ధ, ఆప్యాయత, ప్రేమ అతన్ని ముగ్ధుడిని చేశాయి అలాంటి మాలతి ఋణం ఏ విధంగా తీర్చు కోవటమా అనిపించిందతనికి.

ఆ మర్నాడు —

శంకరం రమాపతిగారి ఆఫీస్‌కు వెళ్ళాడు రమాపతిగారు ఉద్యోగం



ప్రొసీడింగ్స్ ఇచ్చాడు శంకరానికి ఆనాడే వుద్యోగంలో జాయిన్ అయ్యాడు శంకరం

చాలా రోజుల తర్వాత నిండుగా వూపిరి పీల్చుకున్నాడు శంకరం ఇప్పటికి తనూ ఒక ఆర్జనా పరుడై నాడు ఇప్పుడు తను 'నిరుద్యోగి శంకరం' కాదు 'మిష్టర్ శంకరం' అని పిలుస్తాడు గణపతి ఇక

తనకూ సమాజంలో ఒక వ్యక్తిత్వం, విలువవుంటాయి ఈనాడు తానీ స్థితికి రావటానికి కారణభూతురాలైన వసంతకి తానెంతో ఋణపడి వున్నాడు

అవును ఆనాడు వసంత తనను కించ పఱిచి 'భార్య సంపాదనమీద ఆధారపడిన వాడి'వని హేళన చేసింది కాకపోతే, నిరూపించుకో మంటూ వంద రూపాయలు అప్పు అడిగింది. ఆమె అప్పు అడగటమే తన క్రొత్త జీవితానికి నాంది

ఇక వసంతవద్దకు ధైర్యంగా వెళ్తాడు తను అన్నగా ఆమెను అన్ని విధాలా ఆదరిస్తాడు

"వసంతకు తన వుద్యోగం సంగతి తెలియ జేయాలి" అనుకున్నాడు శంకరం.

# 22

ఆరోజు ఒక షిఫాన్ చీర, జాకెట్ క్లాత్ తీసుకుని మాలతి యింటికి బయలుదేరాడు శంకరం ఇన్నాళ్లూ తనను ఆత్మీయుడుగా భావించి ప్రేమాభిమానాలతో ఆదరించి ఉద్యోగం యిప్పించిన మాలతికి వాటిని ప్రెజెంటేషన్ గా ఇవ్వాలను కున్నాడు

శంకరం వెళ్ళేసరికి మాలతి కుర్చీలో కూర్చుని ఏదో వ్రాసు కుంటోంది

"కథ వ్రాస్తున్నారా ?"

శంకరం ప్రశ్నకు మాలతి తలెత్తి, "కథలాంటిదే, రండి, కూర్చోండి" అంది

శంకరం కూర్చున్నాడు

"ఏమిటది ?' శంకరం చేతిలోని ప్యాకెట్ వైపుచూస్తూ అడిగింది మాలతి

"ఒక అందమైన బహుమతి '

"రేణుకకా ? ఇంటికి వెళ్తున్నారా యేమిటి ?"

మాలతి ప్రశ్నకు శంకరం చిన్నబుచ్చుకున్నాడు ఆ సమయంలో ఆమె రేణుక ప్రసక్తి తీసుకు రాకుండా వుంటే బాగుండే దనిపించింది ఎంతైనా స్వజాతి అభిమానం !

తనలో తనే అనుకున్నట్లు శంకరం అన్న మాటని మాలతి విని అంది, "ఎవరికి మాత్రం వుండదు ?"

"ఈ ప్రెజెంటేషను మీకే నాకు చాలా సహాయం చేశారు కృతజ్ఞ

...' ఇక మాటలు రాలేదు.
్కెట్ అందించాడు.

మ్మాలతి తీసుకోలేదు. నవ్వుతూ,
ా రొక్కరూ యిస్తే పుచ్చుకోను.
' రేణూ కూడా కలిసి యివ్వాలి'
ంది.

శంకరం మాట్లాడలేదు. తన
ుమతిని మాలతి తిరస్కరిస్తుందని
ిహించని అతనికి ఆమె మాటలు
ధ కలిగించినై.

కొద్ది క్షణాలు గడచినై.

"శంకరంగారూ, మీకింకా రేణుక
ాద కోపంపోలేదా? మీ పంతమే
గ్గిందిగదా? ఉద్యోగం పురుష
క్షణమని ఉద్యోగం సంపాదిం
ారు. మీరు గెల్చారు ఇక రేణు
మ ..'

శంకరం ఆమెమాటలను మధ్య
ేనే త్రుంచివేస్తూ 'నాకు కొంచెం
ంచినీళ్ళు కావాలి' అన్నాడు,
మాలతి మాటల ధోరణిని ఎలా
మార్చాలో అర్థంకాక.

మాలతి శంకరాన్నిచూసి భావ
గర్భితంగానవ్వి చేతిలోని ప్యాడ్‌ను,
నోట్ బుక్‌ను, కలాన్ని శంకరం ఎదు
రుగావున్న స్టూలుమీదపెట్టి లోప
లికి వెళ్ళింది.

మాలతి తనుతెచ్చిన బహుమతిని
తిరస్కరించటంలో కారణమేమీ కని
పించలేదు శంకరానికి ఆమె ఏ
విధంగా భావించిందో ఆమె అభి
ప్రాయమేమిటో? రేణుకతో తను
ఘర్షణపడటం, లేచి రావటం వూహిం
చకుండా వుంటుందా అనిపించింది

ఆలోచనల్లో మునిగి తేలుతున్న
శంకరం దృష్టి అప్రయత్నంగా
ఎదుటి స్టూలుమీదవున్న కాగితాల
పైకి మళ్లింది ఆమె కథలు తానేమీ
చదవలేదు చూద్దామనిపించింది

నోట్ బుక్ తీశాడు పేజీలు

---

* రోగిపరిస్థితి విషమించింది. సంధివాగుడు మొదలెట్టాడు నర్సుకంగా
రుగా డాక్టరుదగ్గఱకెళ్ళి 'ప్రాణం పోయేలా ఉంది ఏం చెయ్యమ
న్నారు?' అని అడిగింది.
"త్వరగా మన ఫీజు వసూలుచెయ్యి" అని అరిచాడు డాక్టరు

* ఆఫీసులో నిద్రపోతున్న గుమాస్తాల్ని లేపాడు హెడ్‌గుమాస్తా
"గుర్రుపెట్టకండి. మేనేజరుగారు లేస్తారు" అన్నాడు కళ్ళు నులు
ముకుంటూ.

—సోమిన శివరామ ప్రసాద్.

తిరగవేశాడు అందులోని ఒక ఉత్తరం అతన్ని ఆకర్షించింది అది రేణుక మాలతికి నాలుగు నెలల క్రిందట వ్రాసిన ఉత్తరం చదువ కూడ దనుకుంటూనే దాన్ని చదవ కుండా వుండలేక పోయాడు

"మాలతీ, నీ ఉత్తరం చేరింది జవాబు ఏమని వ్రాయమంటావ్ ? ఉన్నట్టుండి వారికి తను నా కంటే తక్కువ వాడిననే కాంప్లెక్సు ఖయలుదేరినట్లు గమనించాను అలదుకు పరోక్షంగా నేనే బాధ్యు రాల్నికావచ్చు కాని ఒక్కవిషయం మాలతీ వివాహం చేసుకొనే టప్పుడు ఒండొరులకుగల యోగ్యతా యోగ్యతలను పరిశీలించు కుంటాం సహజంగా. అలాగే నేనూ ఆలోచించాను వారికంటే నేనెక్కువ చదువుచదివినా, సంపన్నురాలినైనా, ఉద్యోగం చేస్తున్నా, నేనొక సామాన్య స్త్రీనేనని, బావవంటి పురుషునికి భార్యగా వుండగలనని ధైర్యంతో వివాహానికి అంగీకరించాను

నేను వారిని ఎప్పుడూ చులకనగా చూడలేదు. అలక్ష్యం చేయ

లేదు వివాహం అయిన తర్వాత నా పద్ధతుల్ని, అభిరుచుల్ని, స్వభావాన్ని, ప్రవర్తననీ వారికి అనుకూలంగా మలచుకున్నాను, మార్చుకున్నాను నేనేం మాట్లాడితే వారిలో కలిగిన వింత భావాన్ని రెచ్చగొట్టిన దాన్నవుతానోనని జాగ్రత్తగానే మెలగుతున్నాను గృహావరణలో వున్నప్పుడు నేనొక మూడువందల రూపాయల అర్జనా పరురాలననే విషయాన్ని మరచేపోయాను అయినా రాకూడని పరిణామం రానే వచ్చింది

ఒకసారి చెల్లెలి వద్దకు చూసి రావటానికని వెళ్ళి వచ్చి, "నాకో వంద రూపాయలుకావాలి, వసంతకు పంపాలి" అన్నారు నేను వెంటనే యివ్వలేదు అంతగా అవసరమైతే యింటినుంచీ తెప్పించి యిస్తా నన్నాను దాంతో ప్రారంభమైంది రభస వారి అభిమానం దెబ్బతింది. చెప్పా పెట్టకుండా ఇంటినుంచీ బయలు దేరటంతో—నీ పరిభాషలో—కథ క్లైమాక్స్ నందుకుంది. అదీ జరిగిన సంగతి

వారు అక్కడ వున్నట్లు, ఉద్యోగ ప్రయత్నంలో వున్నట్లు వ్రాశావు. చాలా సంతోషం కొన్ని సంఘటనలు మొదట్లో కొంచెం ఇబ్బంది పెట్టినా సుఖాంతంగా పరిణమిస్తాయని నా నమ్మకం వారిలో ఏర్పడ్డ 'కాంప్లెక్స్' సత్ఫలితాలనే యిస్తుందని నా ఆశ. ఆ శుభదినం ఎప్పుడొస్తుందా అని నా తహతహ. ఆనాడు నా ఉద్యోగానికి స్వస్తి



చెప్పి ఫక్తు గృహిణిగా మార్తాను నాకదే తృప్తినిస్తుంది అప్పటివరకూ వారు చేసిన పొరపాటుకు నలుగురి చేత మాటలు పడుతూ రోజులు గడుపుతాను నీ, రేణుక "

శంకరం గట్టిగా నిట్టూర్చాడు ఆలోచనారహితంగా తనుచేసిన పనికి రేణుక మనస్సెంత క్రుంగిపోతోందో తెలిసిందతనికి. ఇప్పటివరకూ తనకూ రేణుకకూ మధ్య ఏదో దట్టమైన తెరలున్నవనీ, అందుకనే తమ సంసారం ఆశించిన విధంగా సాఫీగా నడవలేదనీ తలపోసిన శంకరానికి ఆ తెరలు తొలగిపోయినట్లైంది

రేణుక ఎక్కువ, తను తక్కువ — అనే సంకుచిత భావాన్ని మనసులో పెంచుకున్న తనకు ఆమె ప్రతి కదలికలోన్నూ, పలుకులోన్నూ ఆధిక్యం గోచరించి తనను కించపరుస్తున్నదనే భావన కలిగింది

రేణుకను తను అపార్థం చేసుకున్నాడు పాపం తన ప్రవర్తన వలన ఆమె ఎంతగా బాధపడిందోననిపించి రేణుకపైన జాలి, ప్రేమ కలిగినై శంకరానికి

చేతిలో గాజుగ్లాసుతో మాలతి ప్రవేశించింది. గ్లాసును శంకరానికి అందిస్తూ, "మీకో మాంచి శుభవార్త చెప్తాను ఆ శుభవార్త ఈ షర్బత్తులాగా తీయగా, పుల్లగా గమ్మత్తుగా వుంటుంది చెప్పనా ?" అంది.

గ్లాసును అందుకుని ఏమిటా శుభవార్త అన్నట్లు కళ్ళతోనే ప్రశ్నించాడు శంకరం

"మీ ఆట కట్టింది !"

శంకరానికి అర్థం కాలేదు. "అంటే ?" అన్నాడు

"ఇదివరకటిలా మీరు మీ ఇష్టం వచ్చినట్లు, ఆకతాయిగా బాధ్యతారహితంగా ఉండటానికి వీల్లేదు. బాబు వూరుకోడు "

"బాబా ? ఏ బాబు ? ఏమిటీ గంద్రగోళం మాలతీ ?"

మాలతి చిలిపిగా నవ్వింది. "గంద్రగోళం కాదు మీరు తండ్రి కాబోతున్నారు మెటర్నిటీ లీవుమీద రేణుక రేపు సాయంత్రమే ఇక్కడికి వస్తోంది "

"ఆఁ !" అంటూనే గ్లాసులోని షర్బత్తును గటగటా త్రాగేశాడు శంకరం

మనస్సు చల్లబడింది ఏదో గమ్మత్తుగానే వుంది.

# 23

"నీ పద్దతి బొత్తిగా బాగా లేదు రేణూ !"

"పోనీలే అన్నయ్యా "

"పోనీలే ఏమిటి రేణూ, రాను రానూ మరీ అమ్మమ్మలా తయారవుతున్నావు "

"రేణూ, చివరిసారిగా నేనడుగుతున్నాను నువ్వు వస్తావా రావా? కార్లో వెళ్ళి కారోనేగదా రావటం" అన్నాడు శంకరం.

రేణుక భర్త కళ్ళల్లోకి చూసింది, పన్నగానవ్వింది. "వస్తాను. క్షణంలో తయార్." అంటూ లేచింది.

అందరి మొహాల్లోనూ ఆనందం తాండవించింది.

"ఎలాగైనా, శంకరం కోపగించుకునేసరికి భయపడింది రేణు" అన్నాడు రఘు శంకరాన్నుద్దేశించి.

"ఎవరూ కోపగించుకోవటం కాదుగాని, ఎలాగైనా మిస్ట్ సిస్టర్ చాలా మారిపోయింది" వేణుమాధవ్ సాలోచనగా అన్నాడు.

"ఏం విటీ, రేణుకాదేవిగార్లు మారిపోయినారా?" అంటూ ప్రవేశించాడు కాళిదాసు. అతని వెంట కాంతారావు కూడా ప్రవేశించాడు.



శంకరం వాళ్ళిద్దర్నీ విష్ చేశాడు. "మీకు చూపు కలిగినందుకు చాలా ఆనందంగా వుంది" శంకరం కాంతా రావు నుద్దేశించి అన్నాడు

"అంతా మీ బావగారి దయ" అన్నాడు కాంతారావు నవ్వుతూ.

ఇంతలో లోపల్నుంచీ రేణుక ప్రవేశించింది వచ్చి కాళిదాసును, కాంతారావును పలుకరించిసోఫాలో కూర్చుంది కాళిదాసు ఆమెతో ఏదో వాగేయటం మొదలెట్టాడు



వేణుమాధవ్ రేణుకను తేరిపార జూసేడు.

ఫలభారంతో శోభాయమానంగా వున్న రసాలంలావుంది రేణుక. ఆమె ముఖంలో ప్రసన్నత, గాంభీర్యం, కళ్ళలో నూత్న తేజం; శరీరంలో నిండుదనం గోచరించినాయతనికి. కొండలోయలనువీడినసెల యేటిలా ధీర గంభీరంగా వున్న రేణుకనుచూసి, వేణుమాధవ్ హృదయం గౌరవాభిమానాలతో నిండిపోయింది.

సర్వమూ తెలిసిన వేదాంతిలా తనలో తను చిరునవ్వు నవ్వుకున్నాడు.

ఎవ్వరూ గమనించని ఆ నవ్వును రేణుకే గమనించగలిగింది.

**సమాప్తి**

## చందాదార్లకు మనవి

పాత చందాదారులు తిరిగి చందా పైకం పంపేటప్పుడు తమ చందా నంబరు, అడ్రసు వివరంగా వ్రాసి మాతో సహకరించ ప్రార్థన.

మేనేజరు,
"జ్యోతి"

# శని గ్రహానికి వడ్డాణం

16వ శతాబ్దంలో గెలీలియో తాను మొట్టమొదటగా తయారు చేసిన దూరదర్శినీ యంత్రాన్ని ఉపయోగించి ఖగోళాన్ని పరిశీలిస్తూన్న తొలిరోజులలో శనిగ్రహాన్ని చూచి నివ్వెరపోయాడు. ఈ గ్రహానికి చుట్టూ పలుచని రేకువంటి చక్రం బొమ్మలలో దేవుళ్ళ తలల చుట్టూ ఉండే జ్యోతిశ్చక్రం వంటిది కుమ్మరిసారె ఆకారంలో – బహు సుందరంగా కనిపించింది. – అయితే మిగిలిన గ్రహాలకు వేటికీలేని ఈ ప్రత్యేకత ఒక్క శనిగ్రహానికే ఎల్లా వచ్చింది? అసలు ఈ చక్రం ఏమిటి? దానిని ఎవరు తగిలించారు?...

ఈ విషయాలు అర్థంకాక హేమాహేమీలైన ఖగోళశాస్త్రజ్ఞులు రెండు వందల సంవత్సరాల పాటు కిందా మీదా పడ్డారు. ఆఖరికి హైజిన్స్, కాసినీ, మాక్స్‌వెల్, కీలర్, రోషే వంటి శాస్త్రజ్ఞుల కృషి ఫలితంగా ఈ వడ్డాణపు గుట్టు బయటపడింది. 38,000 మైళ్ళ వెడల్పున, సుమారు 50, 60 మైళ్ళ మందం మాత్రమే వున్న ఈ చక్రంలో జాగ్రత్తగా పరిశీలిస్తే మూడు విడి విడి భాగాలున్నట్లు తెలుస్తుంది. అంటే ఒక దానికన్న ఒకటి చిన్నదిగా ఉన్న మూడు విడివిడి చక్రాలు ఒక దాంట్లో ఒకటి అమర్చినట్లు – మధ్య మధ్య నల్లని ఖాళీలతో – కనిపిస్తుంది. ఆ చక్రం అసలు ఏకఖండం కానే కాదనీ, అందులో కోటాన కోట్లు విడి విడి ముక్కలు ఉండితీరాలనీ మాక్స్‌వెల్ పండితుడు గణిత సహాయంతో రుజువుచేశాడు. అందులో ఇసుక రేణువులనుంచి గులకరాళ్ళ వరకూ రకరకాల సైజులరాళ్ళు, మంచు ముక్కలు శనిగ్రహంచుట్టూ ఒకే సమతలంతో గిరగిరా ప్రచండ వేగాలతో తిరుగుతున్నాయి. – పెద్ద పెద్ద టెలిస్కోపులకు కూడా ఆ చక్రంలోని ముక్కలు విడి విడిగా కనిపించవు. అసంఖ్యాకమైన ఈ చిన్న చిన్న రాతి ముక్కలు దగ్గర దగ్గరగా ఉండి సూర్యకాంతిని ప్రతిఫలిస్తూ చక్రం ఆకారంలో కనిపిస్తున్నాయి.

అయితే ఈ చక్రం ఎల్లా ఏర్పడింది? 1850 లో "రోషే" అనే

డాక్టర్ మహీధర నళినీమోహన్

ఫ్రెంచి గణితశాస్త్రజ్ఞుడు ఈ ప్రశ్నకి సమాధానం చెప్పేడు.

గ్రహంచుట్టూ తిరిగే ఉపగ్రహం మీద ఎల్లప్పుడూ రెండు సరిసమానమైన పరస్పర వ్యతిరేక శక్తులు పని చేస్తూ ఉంటాయి. వీటిలో మొదటిది తల్లిగ్రహం ఉపగ్రహాన్ని తన వైపు ఆకర్షించే శక్తి. దీనినే గురుత్వాకర్షణ శక్తి అంటారు. రెండవది వికేంద్రశక్తి (సెంట్రిఫ్యూగల్ ఫోర్స్) వక్రమార్గంలో తిరిగే ప్రతి వస్తువుమీదా ఈ వికేంద్ర శక్తి పని చేస్తుంది. ఈ శక్తి తిరిగే వస్తువును వక్రమార్గపు కేంద్రం నుంచి దూరంగా తోసివేయడానికి ప్రయత్నిస్తుంది. ఈ రెండు శక్తులూ సరిగ్గా ఒకదానికొకటి సరిసమానం అవడంచేత ఉపగ్రహం తల్లిగ్రహం చుట్టూ అనంత ప్రదక్షిణాలు చేస్తోంది.

ఉపగ్రహం తల్లిగ్రహానికి బాగా దగ్గరగా ఉంటే గ్రహాకర్షణ, దానిని ఎదిరించే వికేంద్రశక్తి కూడా చాలా బలీయంగా ఉంటాయి. ఈ రెండు శక్తులూ ఎడా పెడా పట్టి లాగుతూ ఉంటే ఉపగ్రహం దోసకాయలా సాగిపోతుంది. గ్రహానికి ఇంకా దగ్గరగా ఉంటే అటూ ఇటూ సాగదీసే గురుత్వాకర్షణ వికేంద్ర శక్తులకు తట్టుకోలేక ఉపగ్రహం పగిలి ముక్కలై పోతుంది. అయితే, ఎంత చేరువలోకి వస్తే ఈ ప్రమాదం జరుగుతుంది? రోషే సిద్ధాంతం ప్రకారం, ఉపగ్రహం ఏదైనా దాని తల్లి గ్రహానికి 2.44 గ్రహ వ్యాసార్ధాల దూరంలోకి రావడం తటస్థిస్తే ఆ ఉపగ్రహం ముక్కలు ముక్కలు అయిపోతుంది. అంటే, గ్రహం మధ్య బిందువును కేంద్రంగానూ, 2.44 గ్రహవ్యాసార్ధాల దూరంలోకి రావడం తటస్థిస్తే ఆ ఉపగ్రహం ముక్కలు ముక్కలు అయిపోతుంది. అంటే, గ్రహ మధ్య బిందువును కేంద్రంగానూ, 2.44 గ్రహవ్యాసార్ధాల దూరాన్ని కేంద్రంగానూ కలిగిన ఒక గోళాన్ని ఊహించుకుంటే, ఈ గోళంలో లేక ఈ ఆవరణలో అడుగుపెట్టిన ఉపగ్రహం పగిలిపోక తప్పదు.

శనిగ్రహానికి ప్రస్తుతం తొమ్మిది ఉపగ్రహాలున్నాయి. బహు పురాతన కాలంలో ఎప్పుడో మరో ఉపగ్రహం అదనంగా వుండేది. అది సౌర కుటుంబపు నియమాలు పాటించని గడుగ్గాయి లాగ శనిగ్రహపు ప్రమాదకరమైన ఆవరణలోకి దొంగతనంగా ప్రవేశించింది. పాపం, వెంటనే శిక్ష ననుభవించింది. బలీయమైన గ్రహాకర్షణ ఒకవైపూ, వికేంద్ర శక్తి మరోవైపూ పట్టుకుని లాగుతూ వుంటే ఈ ఉపగ్రహం కోడిగుడ్డులా సాగిసాగి, ఆఖరికి పగిలి ముక్కలు ముక్కలై పోయింది. ఒకసారి పగిలేక యింక దానికి అంతులేదు. ఆ



ముక్కలు ఒకదానినొకటి గుద్దుకుని, లక్షోపలక్షల శకలాలు అయి పో యాయి. ఈ ముక్కలు అన్నీ శని గ్రహం చుట్టూ ప్రదక్షిణాలు చెయ్యడం తప్ప మరేమీ చేయలేక పోయాయి ఈ చక్రం చివరి అంచు గ్రహ కేంద్రానికి 86,300 మైళ్ళ దూరంలో – అంటే సుమారు 24 గ్రహ వ్యాసార్ధాల దూరంలో ఉంది! రోషే సిద్ధాంతానికి ఇంతకన్న చక్కని నిదర్శనం ఏం కావాలీ?

గురు గ్రహం చుట్టూ 12 ఉప గ్రహాలు ప్రదక్షిణాలు చేస్తున్నాయి. వాటిలో మొదటిది (దాని పేరు "ఐయో") గురునికి 2, 62, 200 మైళ్ళ దూరంలో 42 గం 28 నిమి షాలకు ఒక ప్రదక్షిణం పూర్తి చేస్తోంది. గ్రహరాజమైన గురునికి ఇంత సమీపంలో ఉండడంచేత ఈ ఉపగ్రహం గోళాకృతిని పోగొట్టు కుని ప్రస్తుతం దోసకాయ ఆకారంలో ఉంది ఆ ఉపగ్రహం గురునికి మరి కొంచెం దగ్గరలోకివస్తే ఇంకా సాగ దీయబడి ఆఖరి 1, 08, 000 మైళ్ళ దూరానికి రాగానే అది ముక్కలు ముక్కలుగా పగిలిపోక తప్పదు అప్పుడు శనికిలాగే గ్రహరాజుకి కూడా కిరీటం ఏర్పడుతుంది!

కుజ గ్రహం చుట్టూ తిరిగే "ఫీబోస్" అనే ఉపగ్రహం ఈ ప్రమాదానికి చాలా చేరువలో ఉంది. అది తల్లి గ్రహానికి 5830 మైళ్ళ దూరంలో ఉంది రోషే సిద్ధాంతం ప్రకారం అది 5207 మైళ్ళ దూరం లోకి వస్తే ఛిన్నాభిన్నమై పోతుంది. రోషే ఆవరణకి ఇంతదగ్గరలో ఉన్న ఉపగ్రహం ఇదొక్కటే.

అయితే ఉపగ్రహం తల్లి గ్రహం చుట్టూ రామా కృష్ణా అనుకుంటూ ప్రదక్షిణాలుచేస్తూ గడపక, తీరి కూర్చుని తల్లి గ్రహానికి దగ్గరగా ఎందుకు వస్తుందీ? ఈ ప్రశ్న కి సమాధానం వచ్చే సంచికలో ప్రచు రించమన్న "చంద్రుని ఏక పత్నీ వ్రతం" లో చూడండి. గురుత్వాకర్షణ వల్ల ఏర్పడ్డ సముద్రపు

పొంగుతోడి ఘర్షణవల్ల తన చుట్టూ తాను నెమ్మదిగా తిరగడం, గ్రహానికీ ఉపగ్రహానికీ మధ్య నున్న దూరం మారడం జరుగుతాయని తెల్లుసుకోగలం. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో ఉపగ్రహం తల్లిగ్రహం వైపుగా కదిలి, ప్రమాదంలో పడిపోతుంది

జార్జి డార్విన్ సిద్ధాంతం ప్రకారం మరో 5000 కోట్ల సంవత్సరాల పాటు చంద్రుడు ఇప్పటిలాగే భూమికి దూరంగా జరిగిపోతూ ఉంటాడు. అప్పుడు నెలపొడవు 47 రోజులకు సమానం అవుతుంది రోజు పొడవు పెరిగి పెరిగి అదికూడా 47 రోజులకు సమానం అవుతుంది! ఆటు తరువాత చంద్రుడు భూమికిదగ్గరగా రావడం మొదలు పెడతాడు. వచ్చి వచ్చి 11,300 మైళ్ళ దూరంలోకి రాగానే రోషే సిద్ధాంతం ప్రకారం ముక్కలై పోతాడు. అప్పుడు భూమికి కూడా వడ్డాణం ఏర్పడుతుంది

అది సరే కాని, శనిగ్రహ వలయంలో కొన్నిచోట్ల ఖాళీ ప్రదేశాలు ఎందుకు ఏర్పడ్డాయి? దానికి ఆ గ్రహం చుట్టూ తిరిగే ఇతర ఉపగ్రహాల ఆకర్షణే కారణం. అదంతా మరో పెద్ద కథ

***



## జగ్గయ్య ఎం. పి.

లోక్‌సభకు ఆంధ్రప్రదేశ్ నుంచి ఎన్నికైన మొదటి సినిమా నటుడు శ్రీ కొంగర జగ్గయ్యను అభినందించడానికి ఫిలిం నిర్మాతలు శ్రీయుతులు ఎన్ త్రివిక్రమరావు, డి. వి. ఎస్. రాజు, డి రామానాయుడు, ఎస్. భావనారాయణ, బి. విఠలాచార్య, ఎన్. రామబ్రహ్మం, ఎమ్. జగన్నాథరావు, యు. విశ్వేశ్వరరావు, ఏ ఎస్ ఆర్. ఆంజనేయులు, తోట సుబ్బారావు, పి. గంగాధరరావు, ఏ పుండరీకాక్షయ్య, కె. సోమశేఖరరావుగారలు మార్చి నాల్గవ తేదీ రాత్రి మద్రాసులో విందు, సభ జరిపారు. కళాశాల చదువుల కాలంలో జగ్గయ్యకు సహాధ్యాయుడైన శ్రీ ఎన్. టి. రామారావు అధ్యక్షత వహించారు.

ఆనాటి కార్యక్రమానికి పైన పేర్కొన్న నిర్మాతలుకాక, ఈ వ్యాసంలో ముందు పేర్కొనబోయే ప్రముఖులే కాక శ్రీయుతులు కె.వి. రెడ్డి దుక్కిపాటి మధుసూదనరావు, ఏ వి సుబ్బారావు, రాజేంద్ర ప్రసాద్,కమలాకర కామేశ్వరరావు, కె ప్రత్యగాత్మ, వి మధుసూదనరావు, కె. హేమాంబరధరరావు, డి వి. నరసరాజు, దాశరధి, కృష్ణకుమారి, రాజసులోచన, ఎస్. రాజేశ్వరరావు మొదలైనవారు వచ్చారు.




డి ఎస్. రాజు ఇలా అన్నారు:

శ్రీ జగ్గయ్యకు విశేషమైన రాజకీయ పరిజ్ఞానం వుంది. కాంగ్రెస్ అగ్రనాయకులతో అనుదినం ఆయన పెట్టుకొన్న సంబంధంవల్ల జగ్గయ్య నేడు ఎం పి అయ్యారు. ఇంత వరకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు సినిమా పరిశ్రమపట్ల సానుభూతి లేదు. మన సమస్యలను వారు సరిగా అర్థం చేసుకోలేదు. వారికి అర్థమయ్యేందుకు మనం చేసిన ప్రయత్నం ఫలించలేదు. ఇప్పుడు శ్రీ జగ్గయ్యద్వారా సత్ఫలితం కలిగే అవకాశం లభించింది.

### ఎన్. టి. రామారావు

"సినీ నటుడు శ్రీ జగ్గయ్య విజయం పరిశ్రమకే గర్వకారణం. మిగతా రాష్ట్రాల సంగతి ఎలా వున్నా మన రాష్ట్రంలో ఒకరు మన సినిమారంగం గౌరవం దక్కించారు.

ఇన్నాళ్ళూ మన కష్టాల గురించి, సమస్యలగురించి ప్రభుత్వం చెవిని గట్టిగా పడవేసే గట్టిమనిషి మనకు లేకపోయాడు ఇప్పుడు లభించాడు.



పద్మశ్రీవారి "ప్రాణమిత్రులు" చిత్రంలో
నాగేశ్వరరావు, జగ్గయ్య

---

కాలేజి కాలంనుంచి నాకు సోదర భావంగల కొంగర జగ్గయ్య ఆ పెద్ద మనిషి

శ్రీ జగ్గయ్య విద్యాధికుడు భారత సంస్కృతి మూర్తీభవించి వున్నవాడు. సినిమా పరిశ్రమ కష్ట సుఖాలు బాగా తెలిసినవాడు. మన బ్రతుకెంతో, మనం సంపాదిస్తున్న దెంతో, మనసినిమాజీవితం ఎన్నాళ్లో, మనం చెల్లించే పన్నులు ఎంతో, మనకు మిగులుతున్న దెంతో బాగా తెలిసినవ్యక్తి. పరిస్థితులను బాగు పరచ ప్రయత్నించగల శక్తిమంతుడు. ఢిల్లీలోనూ కార్యదక్షులై పంపక్ర్తగా పేరు గడించగలరనే అనుకొంటున్నాను.

### బి. ఎన్. రెడ్డి

ఆంధ్ర సినీనటుడు శ్రీ జగ్గయ్య పార్లమెంట్‌కు ఎన్నికకావడం సువర్ణాక్షరాలతో లిఖించదగిన విషయం. శ్రీ జగ్గయ్య సినిమా పరిశ్రమ యిబ్బందుల గురించి పార్లమెంట్ చర్చలలో కంటె పార్లమెంట్ వెలుపల, తోటి సభ్యులను కలుసుకొన్నప్పుడు వారికి వివరించి, పరిశ్రమపై

కోరికున్న దురభిప్రాయాలను వదల గొట్టాలి. లాబీయింగ్‌తో జగ్గయ్య చాలా పెద్ద మార్పులు తీసుకొని రావచ్చు. రామారావు బృందం ఈ విధంగా జగ్గయ్యను ప్రోత్సహించడం ఆనందదాయకం

## "పద్మశ్రీ" నాగయ్య

జగ్గయ్య నియోజక వర్గంలో స్వయంగా ప్రచారంచేసిన వారిలో నేనొకణ్ణి. సినిమా నటుడిగా జగ్గయ్యను గెలిపించవలసిందని ప్రజలకు విజ్ఞప్తి చేశాను. గెలిచారు. ఇక జగ్గయ్య సినిమా రంగంతో సంబంధాలు వుంచుకొనడమే కాక ఒంగోలు నియోజక వర్గానికి పదే పదే వెళ్ళి, ప్రజల కష్టసుఖాలు విచారించి, వారికి సేవ చెయ్యాలి. మన తెలుగు సినిమారంగంలో ఇప్పుడు లోక్‌సభకు వెళ్ళగల అర్హత ఒక్క జగ్గయ్యలోనే నాకు కన్పించింది.

## జమున

నన్ను స్త్రీల తరపున మాట్లాడ వలసిందని శ్రీ ఎన్. త్రివిక్రమరావు గారు కోరగా మాట్లాడుతున్నాను. కంచుకంఠంతో ప్రేక్షకులను ఆకట్టు కొన్న శ్రీ జగ్గయ్య పరిపూర్ణమైన రాజకీయ విజ్ఞానం సంపాదించుకొని వున్నారు. అందుకే ఎన్నికయ్యారు. నటుడు ఎన్నిక కావడం మగవారికి మరింత ఆనందదాయకమై వుండ వచ్చు. ఆడవారికి కూడా ఇదే విధమైన అవకాశం కల్పించగలరని ఆశిస్తున్నాను. అయితే అందుకు తగిన సమర్థతను, రాజకీయ విజ్ఞానాన్ని స్త్రీలు సంపాదించుకొని వుండాలి. సంపాదించుకొన్న వారు కొందరున్నారు. ఇంకా ఎందరో లలితాంగులు విజ్ఞాన సంపన్నలై లోక్‌సభకు ఎక్కాలి.

## సి. ఎస్. రావు

"పదండి ముందుకు" తీసిన జగ్గయ్య తన జీవితంలోనే అంత పనీ చేశారు. ఆయన కళాజ్యోతి. ఆశాజ్యోతి. ఫిలింపరిశ్రమ చాలా చాలా యిబ్బందులలో వుంటున్న దంటున్న మనం కూడా అందుకు గల కారణాల గురించి ఆత్మ పరిశోధన చేసుకోవాలి.

## రేలంగి

సినిమావారి జీవితం ఎటువంటిదో ఒక్క ఉదాహరణ. నేను సినిమా నటుడుగా 50 లక్షలు సంపాదించాను. కాని రెండులక్షలఅప్పులో వున్నాను. ప్రజలకు నా సంపాదన గురించి మాత్రమే తెలుసు. నా అప్పుల గురించి పట్టించుకోరు. జగ్గయ్యకు వచ్చిన 82,000 మెజారిటీలో 60000 స్త్రీల వోట్లు. సినిమా నటుడుగా సంపాదించుకొన్న మెజారిటీ అది. సినిమావారి బలం ఏమిటో ఈ విధంగా అయినా ప్రభుత్వం తెలుసు కోవచ్చు. తెలుసుకోక పోయిందీ అంటే, పరిశ్రమను ఇకమీద కూడా



"కంచుకోట" చిత్రములో ఎన్ టి రామారావు కాంతారావు

బాధిస్తూ వుందీ అంటే లోక్ సభను సినిమావారితో నింపేస్తాము. జాగ్రత్త. జగ్గయ్య విజయం మన ఫిలిం పరిశ్రమకే విజయం.

## ఎం. వి. జగ్గయ్య సమాధానం

శ్రీ జగ్గయ్య తన సమాధానంలో యిలా పేర్కొన్నారు:

"యుద్ధంలో విజయం సాధించి వచ్చిన వ్యక్తికి యిచ్చే సత్కారం నాకు యిచ్చారు. నిజంగా ఎన్నికలు కూడా ఒక యుద్ధం వంటివి ప్రకాశంగారి తర్వాత ఒంగోలులో కాంగ్రెస్ గెలుపొందడమనేది కష్టమే అయింది. ఇన్నాళ్ళకు తిరిగి ఒక కాంగ్రెస్ అభ్యర్థిని – ఎన్నుకొన్నారు అంటే ప్రజలు తమ సమస్యలను ఇకనైనా పరిష్కరించే యత్నం చెయ్యగల శక్తి నాకు వున్నదని తలంచి నా కా భారాన్ని యిచ్చి వుండాలి ఒంగోలు నియోజక వర్గం క్షేమం, మన సినిమా విద్యోజక వర్గం సంక్షేమం సర్వకాల సర్వావస్థలలోను జ్ఞాపకం పెట్టుకొంటాను సినిమా పరిశ్రమ జాతీయకరణకు వ్యక్తిగతంగా నేను అంగీకరించను"

శ్రీ కోట సుబ్బారావు కృతజ్ఞతాభినందనలు తెలియజేశారు.

* * *

"అర్ధరాత్రి", "ప్రాణమిత్రులు", "గృహలక్ష్మి" "గొల్లభామ భువనసుందరి కథ" "వీరపూజ "శివలీలలు "సరస్వతీ శపథం" ఏ రోజునైనా విడుదల కావచ్చు

## సినీ నటుడు, నిర్మాత,
## ఎమ్. ఎల్. ఏ.
# ప్రభాకరరావు

బాపట్ల నియోజక వర్గం నుంచి ఆంధ్రరాష్ట్ర శాసనసభకు కాంగ్రెస్ అభ్యర్థిగా ఎన్నికైన శ్రీ కోన ప్రభాకరరావు నిన్న మొన్నటివరకూ సినిమా నటుడు. అంతకుముందు ప్రముఖ సినిమా నటుడు, దర్శకుడు, నిర్మాత. ఆయన నిర్మించిన "రూపవతి" జూనియర్ ఆర్టిస్టులకు మంచి భవిష్యత్తు చూపింది.

హాస్య ప్రధాన సంసార పక్ష చిత్రం "మంగళసూత్రం" (1946) నిర్మించారు. ప్రభాకరరావు హీరో.



వాసు మూవీస్ వారి
**"మా వదిన"లో**
**కాంతారావు, కృష్ణకుమారి**

లక్ష్మీరాజ్యం నాయిక. యువతీ యువకులు. భార్యాభర్తలు కాకపోయినా, పరిస్థితుల ఒత్తిడివల్ల అలా చెప్పుకొని, చెప్పుకొన్నా నీతీ నియమాలు పాటించడంపై చిత్రకథ హుషారుగా పరుగిడింది. శ్రీ ప్రభాకరరావు "దాసి"లో (1952) విలన్ భూమిక ధరించారు. "ప్రజాసేవ", "సావాసం", "రూపవతి" (1951) మొదలైన చిత్రాల దర్శకుడు. చివరి చిత్రం నిర్మాత. ఇటీవల "ఉయ్యాల - జంపాల" (1965) చిత్రంలో నటించారు. ప్రస్తుతం న్యాయవాది.

నాటక, క్రీడా రంగాలలో కూడా గణుతి కెక్కిన ప్రభాకరరావు, గత ఎన్నికల తరుణంలో 'ప్రతిజ్ఞ' అనే నాటకం వ్రాయించుకొన్నారు. ఆ సమస్యా నాటక ప్రదర్శనం చాలా చాలా వోట్లు తెచ్చి పెట్టింది.

# గృహలక్ష్మి

భరణీవారి "గృహలక్ష్మి" లక్ష్మి (భానుమతి) అనే గృహలక్ష్మి నిగ్రహలక్ష్య కథ. మార్చి 15, 16 తేదీలలో చివరి షూటింగు షెడ్యూలు పూర్తయి విడుదలకు నిరీక్షిస్తున్నది.

"వివాహే విద్యా నాశాయ" అంటారు పెద్దలు. కాని అదోతరహా న్యాయవాది భగవంతం (రంగారావు) ఆ నుడి నుడి కొద్దిగా తిప్పాడు. వివాహంతో విద్య నాశ



పద్మశ్రీవారి "ప్రాణమిత్రులు చిత్రంలో గీతాంజలి గుమ్మడి

నం కాదుగాని ప్రత్యక్ష దాంపత్య జీవితంతో విద్య మిథ్యఅయి పోతుందని ఆయన మతం. ఇంట్లో ఆడపిల్ల లేని వెలితితీర్చడం కోసం ఆ న్యాయవాది తన ఏకైక పుత్రరత్నం, బాచిలర్ ఆఫ్ లా (బి. ఎల్) చదువుతున్న చిట్టిబ్బాయికి (నాగేశ్వర రావు) లక్ష్మి (భానుమతి) అనే సౌందర్య రాశినిచ్చి వివాహం చేశాడు. గృహలక్ష్మి ఇంటికివచ్చింది. ఇంట్లో ఆడపిల్ల తిరగాలనే భగవంతం కోర్కెను భగవంతుడు తీర్చాడు. అయితే బాచిలర్ ఆఫ్ లా చదువుతున్న చిట్టిబ్బాయి, లక్ష్మితో ద్వంద్వ జీవితం, జంటజీవితం గడిపితే అతడికి రాగల పట్టా పట్టాలు తప్పుతుందని భగవంతం [illegible] దంపతులను అన్న ఫ్లాట్ ను రెండు సింగ్యులర్ లుగా విభజించి వేశాడు. ఒకే గూటిలో రెండుపక్షులు ఏకాంతంగా గడపవలసి వచ్చింది. న్యాయవాది అన్యాయాన్ని చిట్టిబ్బాయి అతిక్రమించడానికి అనుక్షణ ప్రణాళిక లేమి ఖర్మ, కుట్రలే పన్నాడు కాని నిగ్రహం కల గృహలక్ష్మి— అంతా మన మేలుకొరకే అంటూ మామ మాటకు వంతపాట వేయడంతో చిట్టిబ్బాయి గట్టి ఆలోచన చెయ్యక తప్పలేదు.

కోట మారిస్తేకాని తన మాట ప్రేమ మూట కాదనుకొన్న చిట్టిబ్బాయి, తన బావమరిదీ, సాక్షాత్తు

న్యాయశాస్త్రతత్వవేత్త వాలి (పద్మనాభం) చేత దొంగ టెలిగ్రాము సృష్టించాడు. చిట్టిబ్బాయి అత్త డేంజర్‌లో వుందన్నది ఆ దొంగతంతి. అసలు తేరంతు తెలియనందువల్ల భగవంతం తన కోడలును కొడుకు సమేతంగా వియ్యపు రాలింటికి పంపాడు.

దొంగ తంతితో కోటు మార్చిన చిట్టిబ్బాయి లక్ష్మిని ఆమె పుట్టింటికి తీసుకొని వెళ్ళక ఎన్నాళ్ళుగానో కలలలో నిర్మించుకొంటున్న ప్రేమ [illegible] — అనగా ఒక లాడ్జింగ్ [illegible]కు — తీసుకొని వెళ్లాడు.

ప్రేయసీ చెనీ వుంటుందనుకొన్న ఆ కోటలో అనుమానపు కత్తుల కందకాలు చాలా వున్నాయి. అక్కడ వుంటున్న హానరమూక — [illegible] రామలింగయ్య, రాజ్‌బాబు, [illegible] కొండలరావు, సీతారామ్ అండ్ కంపెనీ — చిట్టిబ్బాయి, లక్ష్మి వ్యవహారంచూసి "ఇదేం జావతు" అంటూ అనుమానాగ్నిధార కురిపించారు. వీళ్ళసంగ తేమిటో తేల్చుకొనేందుకు "సి. ఐ. డీ" లు బయలుదేరారు.

తత్కారణంగా ప్రేమజంట కొత్త సమస్యల పంటలో పడింది.

దొంగ తంతి పంపిన వాలి, తన తంతు బైట పడకుండా వుండేందుకు వేసిన ప్రతి ఎత్తు ఎదురు తిరగడంతో ఆ ప్రేమ జంటకు కొత్త సమస్యల రెండవ పంట కూడా పండింది!

బాచిలర్ ఆఫ్ లా విద్యార్థి తిరిగి బాచిలర్ (సన్యాసి అనే బ్రహ్మచారి) జీవితం గడపవలసి వస్తుందా?

న్యాయవాది భగవంతం, తన కొడుకు కోడలు దాంపత్య జీవిత ధర్మాన్ని అన్యాయంగా ధిక్కరించినందుకు శిక్ష అనుభవిస్తాడా?

నిగ్రహ, ఆగ్రహ, అనుగ్రహాల తుఫానులు చెదరిపోయిన గృహలక్ష్మి అంతిమ లక్ష్యం ఏది?

ఈ ప్రశ్నలకు కొద్ది రోజుల్లోనే భరణీవారు పి రామకృష్ణ, డి. వి. నరసరాజు, సముద్రాల రాఘవాచార్య, డాక్టర్ సి. నారాయణరెడ్డి, ఆరుద్ర, కొసరాజు, ఎస్. రాజేశ్వరరావు, సి. నాగేశ్వరరావుల పరంగా అమిత వినోదాత్మకంగా వెండి తెరపై సమాధానమిస్తారు.

# లలితాదేవి ఆలయంలో వర్ణదృశ్యాలు

లలితా శివజ్యోతివారి "హాస్యం" ఈస్ట్‌మన్ కలర్ చిత్రంలో లలితాదేవి ఆలయం గర్భగుడి సెట్‌లో మార్చి రెండవవారంలో చిత్రీకరణ జరిగింది. మద్రాసు భరణీ స్టుడియోస్‌లో గర్భగుడి, దేవాలయ ఇతర భాగం సెట్‌ను వేశారు. టి. వి. ఎస్. శర్మ కళా నైపుణ్యానికి నిదర్శనంగా నిలచిన ఆ సెట్‌లో



శ్రీ దేవి ప్రొడక్షన్స్‌వారి "భువన సుందరి కథ"లో
ఎన్. టి. రామారావు, కృష్ణకుమారి

సర్వాలంకార శోభితమైన లలితా దేవి విగ్రహం 12—13 అడుగుల ఎత్తుది నెలకొల్పారు ఎర్రకలువపై ఆసీనురాలైన లలితా దేవి అభయ ముద్ర, జ్ఞాన నేత్రాలు, ప్రకాశ వదనం, కరుణామూర్తి చూడగానే ఎట్టివారికైనా భక్తి పారవశ్యం కలుగక మానదు

ఒక సామాన్యుడు (నాగేశ్వర రావు) దేవిని ప్రార్థించడం, జ్యోతుల చలనం, దేవికరుణ, దేవిపై పుష్ప వర్షం [illegible] ఘట్టాలు చిత్రీకరించారు

ఖడ్గధారి, సాహసి, [illegible] అయిన ఆ సామాన్యుని, రాజు సత్కరించడం మొదలైన ఘట్టాలు కూడా చిత్రీకరించారు ఎన్. వి రంగారావు, కాంతారావు, గుమ్మడి, రమణారెడ్డి, నాగయ్య, రాజనాల, లింగమూర్తి, నారాయణరావు, లంక సత్యం, హరనాథ్ (గెస్ట్) సరోజాదేవి, కృష్ణకుమారి, [illegible] లక్ష్మి, సూర్యకాంతం, [illegible]దేవి

(గెస్టు) మొదలైనవారు నటిస్తున్న ఈ పౌరాణిక లక్షల జానపద పౌరాణిక చిత్రంలో ఇంకా రెండు మూడు పెద్ద సెట్లపై పని వుంది

మార్చి రెండవ వారం షూటింగ్ జరిగిన దేవాలయంలో సెట్ లో దేవాలయ కుడ్యాలకు అమర్చిన దేవతా మూర్తులు కూడా సహజత్వంతో ఇప్పారినవి లలితా దేవి కుడి ఎడమల విఘ్నేశ్వరుడు, సుబ్రహ్మణ్య స్వామి విగ్రహాలు, ఎడమ కుడ్యంలో గాయత్రీ దేవి మొదలైన విగ్రహాలు, కుడికుడ్యంలో మీనాక్షి, శక్తి మొదలైన విగ్రహాలు అమర్చబడి వున్నాయి.

ప్రశాంత నిర్మాత, ఉన్నత విద్యావంతులు (ఎమ్ ఏ బి ఎల్) మీదు మిక్కిలి లలితోపాసకులు ఏ శంకర రెడ్డి స్వయంగా నిర్మాణ కార్యక్రమాలపై అధ్వర్యం వహించి ప్రతి అంశం చక్కగా చిత్రించబడేందుకు శ్రమ తీసుకొన్నారు సహకార దర్శకుడు కేశవరావు, స్టుడియో శబ్ద శాఖ నిపుణుడు సీతంరాజు రామారావు, ఈ సెట్ కు మాత్రం ఛాయా గ్రాహకుడు రామమూర్తి, "రహస్యం" చిత్ర శబ్ద శాఖాధికారి సుందరం, షూటింగ్ బాధ్యతల నిర్వహణలో చేదోడు వాదోడుగ వున్నారు

సంభాషణలు రచించింది సదాశివబ్రహ్మం, సంగీతం ఘంటసాల, వాణీ రిలీజ్

## సాక్షి

నందనా ఫిలిమ్స్ వారి తొలి చిత్రం "సాక్షి" షూటింగ్ కార్యక్రమం దాదాపు ముగిసినట్టే మరి రెండు పాటలతో చిత్రం పూర్తి కాగలదని తెలుస్తున్నది ముళ్ళపూడి వెంకట రమణ కథ, సంభాషణలతో, బాపు దర్శకత్వం, కె వి మహాదేవన్ సంగీత దర్శకత్వం, సెల్వరాజ్ ఛాయాగ్రహణంతో నిర్మాణమవుతున్న ఈ చిత్రం కొన్ని కొత్త పోకడలు పోగలదని, రచయితగా ఒకరు, చిత్రకారులుగా మరొకరు ప్రసిద్ధులైన రమణ, బాపుగార్ల విభిన్న ప్రతిభల సమైక్య ముద్ర



**నవజ్యోతి ఫిలింస్ వారి "పట్టుకుంటే పదివేలు"లో భారతి**



నవజ్యోతి ఫిలింస్‌వారి "పట్టుకొంటే పదివేలు"లో
భారతి, బేబి ఇందిర, బేబి మల్లిక

ఈ చిత్రంపై ప్రగాఢంగా వుండ గలదని కూడా అభిజ్ఞులు చెబుతున్నారు. మొత్తం చిత్రమంతా కోనసీమలో కాల్వగట్టునపల్లెసీమలో మనోహర పరిసరాలలో, చాలా చురుకుగా సాగిపోయింది. దీనిలో కృష్ణ, విజయనిర్మల, విజయలలిత, రామన్నపంతులు, రాజ్‌బాబు, ఇంకా ఎందరో పాత, కొత్త నటులు నటించారు.

## పట్టుకుంటే పదివేలు

గుమ్మడి, చలం, సత్యనారాయణ, గీతాంజలి, భారతి, సూర్యకళ, మున్నగువారు నటిస్తున్న నవజ్యోతి ఫిలిమ్స్‌వారి "పట్టుకుంటే పదివేలు" ఉగాదికి విడుదల చేయాలని నిర్మాతలు సాంబశివరావు, వందనంగార్లు సంకల్పించినట్లు తెలుస్తున్నది. మాటలు భమిడిపాటి రాధాకృష్ణ, పాటలు దాశరథి, ఆరుద్ర, కొసరాజు, శ్రీ శ్రీ, నారాయణరెడ్డి. సంగీతం చలపతిరావు, దర్శకత్వం ఎమ్. మల్లిఖార్జునరావు.

## శ్రీ వెంకటేశ్వరస్వామి ఫిలిమ్స్

పై సంస్థవారు తమ ప్రథమ సాంఘిక చిత్రాన్ని ఎన్. టి. రామారావు, దేవిక, వాణిశ్రీ, ఎల్. విజయలక్ష్మి, ఛాయాదేవి, రాజ

నాల, ధూళిపాళ, రమణారెడ్డి, రాజ్ బాబు, అలు రామలింగయ్య, రావి కొండలరావు, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి మొదలైన వారితో శరవేగంగా నిర్మిస్తున్నారు. దర్శకుడు ఎస్. డి. లాల్, మాటలు పినిసెట్టి. పాటలు దాశరథి, నారాయణరెడ్డి. సంగీతం టి. వి. రాజు.



"సరస్వతీ శపథం"లో లక్ష్మిగా దేవిక

జూన్‌కు పూర్తిచేసి ఆగస్టులో విడుదల చేయాలని నిర్మాత శ్రీ ఎం. జగన్నాథరావు ఆలోచన.

## రామారావు చిత్రాలు

ఎన్. టి. రామారావు విభిన్న భూమికల నిర్వహణనే ప్రధాన లక్ష్యంగా పెట్టుకొన్నారు. వెంకటేశ్వరస్వామి పిలిమ్స్‌వారి చిత్రంలో గజదొంగగా నటిస్తున్నారు. విశ్వశాంతివారి "కంచుకోట"లో సాహస వీరుడు. "ఉమ్మడి కుటుంబం" తరువాత స్వంత చిత్రంలో చాణక్యునిగా నటిస్తారు. "కృష్ణావతారం"లో కృష్ణుడు, "ఉమ-చండి-గౌరి కథ"లో పరమేశ్వరుడు. జయంతి జానపదంలో ఎత్తుకు పైఎత్తు వేసే రాకుమారవీరుడు. సురేష్ కంబైన్స్ వారి కొత్తచిత్రంలో సోదరప్రేమ ప్రశంసనీయంగా ప్రదర్శిస్తున్నారు. "బీబీనాంచారమ్మ", "భువనసుందరి కథ" (జి. వి. జి. రచన) "చిక్కడు-దొరకడు", "గొల్లభామ" చిత్రాలలోను, విజయభట్, డి. వి. ఎస్. చిత్రాలలోను వేర్వేరు రూపాలలో కన్పిస్తారు.

## పూలరంగడు

అన్నపూర్ణావారి "పూలరంగడు"లో మరి కొన్ని పాటలు మార్చి ప్రథమార్థంలో రికార్డు చేశారు.

Edited and Published by V. V. Raghavaiah
and Printed by him at Jyothi Printers.
Congressoffice Road, Governorpet, Vijayawada-2.

